

# భక్తివేదాంత బుక్ ట్రస్ట్



## ఇది వాస్తవంగా జరిగింది

జీవిత పరమార్థాన్ని గూర్చిన అన్వేషణలో ఒక యువ అమెరికా శాంతి సైన్య కార్యకర్త పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలోని ఒక ప్రాచీనమైన కుగ్రామం చేరుకున్నాడు. మాయాపూర్ అనే ఆ పుణ్యస్థలంలో ఒక వెదురు తడికెల కుటీరంలో భారతదేశంలోని అత్యంత మహనీయులైన ఆచార్యులలో ఒకరైన పూజ్యశ్రీ ఏ.సి. భక్తివేదాంత స్వామి వారిచరణ సన్నిధిని చేరుకున్నాడు. అతనిని వేధిస్తున్న సర్వ ప్రశ్నలకూ ఆ ఆచార్యుని వద్ద సమాధానాలు లభించాయి. ఆ ఇరువురి సంభాషణే ఈ

**'ఉత్తమ ప్రశ్నలు - ఉత్తమ సమాధానాలు'**



# ఉత్తమ ప్రశ్నలు ఉత్తమ సమాధానాలు



అంతర్జాతీయ కృష్ణ చైతన్య సంఘం సంస్థాపకాచార్యులు

**పూజ్యశ్రీ ఏ.సి. భక్తివేదాంత స్వామి ప్రభుపాదులకు,**

బాబ్‌కోహెన్‌కూ మధ్య ఇండియాలో జరిగిన సంభాషణ.

# కృష్ణ చైతన్య మార్గం - ప్రధాన సూత్రాలు

1. ప్రామాణికమైన ఆధ్యాత్మిక శాస్త్రాన్ని అనుసరించినట్లైతే మన ఆందోళనల నుండి విముక్తులమై పరిశుద్ధమైన, నిరంతరమైన, ఆనందమయమైన కృష్ణ చైతన్యాన్ని ఈ జీవితంలోనే మనం సాధించగలము.
2. మనం మన దేహాలము కాము. సనాతనమైన ఆత్మ స్వరూపులము. కృష్ణ భగవానుని తాలూకు అంశలము. అందుచేత మనం అందరం సోదరీ సోదరులము. కృష్ణుడు మన కందరికీ ఒకే ఒక పరమపిత.
3. సనాతనుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపి, సర్వశక్తిమంతుడు, సర్వమనోహరుడు అయిన కృష్ణుడు దేవాది దేవుడు. సర్వప్రాణి కోటికీ బీజావాపం చేసిన తండ్రి ఆయన. సర్వసృష్టికీ స్థితికారకుడు ఆయన!
4. ప్రపంచంలోని సర్వమత ఉద్గ్రంథాలలోనూ పరమసత్యం నిక్షిప్తం అయి ఉన్నమాట నిజం. అయినా మిక్కిలి సనాతనమైన, అపౌరుషేయాలైన ఉద్గ్రంథాలతో కూడింది వైదిక సారస్వతం. ఆ వైదిక సారస్వతంలో భగవద్గీత భగవానుని చేతనే స్వయంగా నుడువబడింది.
5. వైదిక విజ్ఞానాన్ని నిస్స్వార్థపరుడైన, స్థిరచిత్తంతో శ్రీకృష్ణుణ్ణి ఆరాధించే ప్రామాణికుడైన గురువువద్ద మనం అధ్యయనం చెయ్యాలి.
6. మనం ఆహారం తీసుకునే ముందు ఆ ఆహారాన్ని భగవానునికి నివేదన చెయ్యాలి. అప్పుడు కృష్ణుడు ఆ ప్రసాదం రూపంలో మనల్ని పరిశుద్ధులను చేస్తాడు.
7. మనం సర్వ కార్యాలనూ కృష్ణార్పణ బుద్ధితోనే చెయ్యాలి. మన స్వంత ఇంద్రియాల తృప్తికోసం ఏదీ చేయరాదు.
8. ఈ కలియుగంలో పరిపక్వమైన భగవద్ భక్తిని సాధించడానికి ఒకే ఒక మార్గం: భగవన్నామ సంకీర్తనం. భగవంతుని స్మరణకు అత్యంత సులభమైన మంత్రం :

హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే

హరే రామ హరే రామ రామ రామ హరే హరే




శ్రీ గురు గౌరంగౌ జయతః

# ఉత్తమ ప్రశ్నలు - ఉత్తమ సమాధానాలు

## PERFECT QUESTIONS PERFECT ANSWERS

అంతర్జాతీయ కృష్ణ చైతన్య సంఘ సంస్థాపకాచార్యులు

**పూజ్యశ్రీ ఏ.సి. భక్తివేదాంత స్వామి ప్రభుపాదులకు**

అమెరికా శాంతిసైన్య కార్యకర్త బాబ్ కోహెన్‌కు మధ్య జరిగిన సంభాషణ

ఆంధ్రానువాదం :

**డా. తిరుమల రామచంద్ర, డి.లిట్.**

వ్యావహారికీకరణ :

**విజయ సర్వలక్ష్మి**



ప్రకాశకులు :

**భక్తివేదాంత బుక్ ట్రస్ట్**

హరేకృష్ణ ల్యాండ్, నాంపల్లి స్టేషన్ రోడ్

హైదరాబాద్ - 500 001

## పూజ్యశ్రీ ఏ.సి. భక్తివేదాంత స్వామి ప్రభుపాదుల వారి రచనలు:

భగవద్గీత యథాతథము
శ్రీమద్భాగవతము (18 సంపుటములు)
శ్రీ చైతన్య చరితామృత (9 సంపుటములు)
శ్రీ చైతన్య మహాప్రభువు బోధామృతము
భక్తి రసామృతము
ఆత్మ సాక్షాత్కార శాస్త్రం
కుంతీ మహారాణి ఉపదేశములు
దేవహూతి కుమారుడైన కపిలుని ఉపదేశములు
దేవాదిదేవుడు శ్రీకృష్ణ భగవానుడు
శ్రీ ఈశోపనిషత్
ఉపదేశామృతం
ఉత్తమ ప్రశ్నలు - ఉత్తమ సమాధానములు
గ్రహాంతర సులభ యానం
కృష్ణ చైతన్యమే సర్వోత్తమ యోగం
వైదిక దృష్టిలో పాశ్చాత్య దార్శనికులు
యోగసిద్ధి పథం
జీవం నుండి జీవం
యోగ పరిపూర్ణత
జనన మరణాలకు అతీతంగా...
కృష్ణుని చేరే మార్గం
రాజవిద్య
పునరావృత్తి
కృష్ణ చైతన్య సాధన
కృష్ణ చైతన్యం-అద్వితీయ వరప్రసాదం
భగవద్దర్శనము (సంస్థాపకుని ఆధ్యాత్మిక పత్రిక)




# విషయ సూచిక


| | | |
|---|---|---|
| | అవతారిక | 1 |
| 1. | కృష్ణుడు సర్వాకర్షకుడు<br>ఫిబ్రవరి 27, 1972 | 5 |
| 2. | వేద సంస్కృతి - వర్ణాశ్రమ ధర్మం<br>ఫిబ్రవరి 28, 1972 | 20 |
| 3. | జీవితానికి నిజమైన లక్ష్యం<br>ఫిబ్రవరి 28, 1972 (సంభాషణ తరువాయి భాగం) | 26 |
| 4. | ప్రకృతికి గల మూడు గుణాలు<br>ఫిబ్రవరి 28, 1972 (సంభాషణ తరువాయి భాగం) | 37 |
| 5. | పరిశుద్ధుడు కావడం<br>ఫిబ్రవరి 29,1972 | 42 |
| 6. | అత్యుత్తమ భక్తుడు<br>ఫిబ్రవరి 29, 1972, సాయంకాలం | 56 |
| 7. | కృష్ణ చైతన్యంతో జీవించడం<br>ఫిబ్రవరి 29, 1972, సాయంకాలం | 75 |
| 8. | కృష్ణ చైతన్య మార్గంలో పురోగతి<br>(ఉత్తర ప్రత్యుత్తరాలు) | 92 |
| 9. | తరువాతి జన్మను నిర్ణయించుకోడం<br>న్యూయార్క్, జూలై 4, 1972 | 95 |
| | ముగింపు మాటలు | 107 |
| | పూజ్యశ్రీ ఏ.సి.భక్తివేదాంత స్వామి ప్రభుపాదుల వారి పరిచయం | 110 |



పూజ్యశ్రీ ఏ.సి. భక్తివేదాంత స్వామి ప్రభుపాద వారి భజన కుటీరం, మాయాపూర్, పశ్చిమ బెంగాల్

# అవతారిక

పూజ్యశ్రీ ఏ.సి. భక్తివేదాంత స్వామి ప్రభుపాదుల వారిని కలుసుకోకముందు దేవుడు, ఆధ్యాత్మిక జీవితం అనే మాటలకు అర్థం నాకు తెలియదు. నాకు మతం అంటే ఎప్పుడూ ఆసక్తే - కాని, ప్రభుపాదుల వారి శిష్యులను కలసికోక పూర్వం ఆధ్యాత్మిక జీవితాన్ని ఫలవంతంగా అన్వేషించడానికి కావలసినంత జ్ఞానం, దానికి సంబంధించిన విజ్ఞానం నాకు ఉండేవి కావు. ఒక సృష్టికర్త ఉన్నాడనే సామాన్య జ్ఞానం మాత్రం ఉండేది. కాని, దేవు డెవరు? నేనెవరు? అనేది మాత్రం నాకు తెలియదు. నేను హీబ్రూ పాఠశాలకు వెళ్ళి ప్రాచ్యవేదాంతాన్ని నేర్చుకున్నాను; కాని నా సందేహాలకు తృప్తికరములైన సమాధానాలు మాత్రం ఎప్పుడూ దొరకలేదు.

1968వ సంవత్సరాంతంలో న్యూయార్క్ లోని 'గ్రీన్‌విచ్ విలేజ్'లో తొలిసారి 'హరేకృష్ణ' మంత్రాన్ని విన్నాను:

'హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే
హరే రామ హరే రామ రామ రామ హరే హరే'

ఆ సంకీర్తనం నన్ను పరవశుణ్ణి చేసి, నాకు ఎంతో సంతోషాన్నిచ్చింది. ఆ మంత్రం నా మనసులో ముద్రితమైంది. ఆ భక్తుల నుంచి ఒక పత్రికను తీసుకోక పోయానే అని బాధపడ్డాను. ఒక దివ్యబీజం నాటబడిందనీ, అది చివరకు భగవద్భక్తిగా పరిపక్వం చెందగలదనీ నాకు కొంత కాలం తర్వాత వివరించారు.

అనేక మాసాల తరువాత హరేకృష్ణ మంత్రం వ్రాసి ఉన్న ఒక అట్టముక్క నాకు కనబడింది. "ఈ భగవన్నామాలను కీర్తించండి. మీ జీవితం మహత్త్యం పొందుతుంది!" అనే వాగ్దానం దాని మీద వ్రాసి ఉంది. అప్పుడప్పుడు నేను ఆ

మంత్రాన్ని ఉచ్చరిస్తూ ఉండేవాణ్ణి. దాని వల్ల ఆ మంత్రం నిజంగానే నాకు మనశ్శాంతిని కలిగింపసాగింది.

కళాశాల నుంచి రసాయన శాస్త్రంలో బి.యస్. పట్టా పొందిన తరువాత 1971 లో శాంతి సైన్యంలో (అమెరికన్ పీస్ కోర్) చేరి భౌతిక శాస్త్ర అధ్యాపకునిగా భారతదేశానికి వెళ్లాను. అక్కడ హరేకృష్ణ ఉద్యమం గురించి చాలా మందిని అడిగాను. ఆ సంకీర్తన నన్ను ఆకర్షించింది. కాని దాని వేదాంతం మాత్రం నాకు అర్థం కాలేదు. ఆ ఉద్యమం యొక్క విశ్వసనీయత్వం గురించి తెలుసుకోవాలని కుతూహలం కలిగింది. భారతదేశానికి వెళ్ళడానికి ముందు న్యూయార్క్‌లోని ఇస్కాన్ కేంద్రమైన రాధాకృష్ణ మందిరానికి చాలాసార్లు వెళ్ళి చూచి వచ్చాను గాని అక్కడ పైకి ఏదో తపశ్చర్యలాగ కనిపిస్తున్న భక్తుల జీవితం నాకు నచ్చలేదు.

భారత దేశంలో 1971 అక్టోబరులో కలకత్తా నగరంలో పూజ్యశ్రీ భక్తివేదాంత స్వామి వారి శిష్యులు జరుపుతున్న ఉత్సవంలో మొదటి సారిగా ఆ కృష్ణ భక్తులను కలుసుకున్నాను. వారి యోగ ప్రయోజనం గురించీ, ఆధ్యాత్మిక జీవితం గురించి తెలుసుకోవలసిన ఆవశ్యకత గురించీ నాకు వివరించారు. వారు చేస్తున్న అనుష్ఠానాలూ, తతంగాలూ ఉత్సవాలూ ఆసక్తికరంగా కనిపించాయి, అవి కేవలం ప్రదర్శనలు కావనీ, నిజమైన, ప్రయోజనకరమైన, అర్థవంతమైన జీవితవిధానమనీ నాకు అనిపించడం ప్రారంభమయింది.

అయినప్పటికీ, మొదట కృష్ణ చైతన్య సిద్ధాంతాన్ని అర్థం చేసుకోడం నాకు చాలా కష్టమయింది. నా ముఖం మీద ముక్కు కనబడుతున్నంత స్పష్టంగా ఉన్న విషయాలను గ్రహించడానికి కూడా నా పాశ్చాత్య విద్యాశిక్షణ నాకు అడ్డం వచ్చేది. అదృష్టవశాత్తూ అక్కడ భక్తులు కొన్ని ప్రాథమిక తపశ్చర్యలను అభ్యసించ వలసిన అవసరం గురించి నాకు నచ్చజెప్పారు. ఆ విధంగా నిజమైన ఆధ్యాత్మిక జీవితం లోని ఆంతర్యాన్ని కొంత గ్రహించగలిగాను. ఆధ్యాత్మికతత్త్వం గురించీ, దివ్య జీవితం గురించీ అప్పటి వరకూ నాకు ఉన్న భావాలు ఎంత



దుర్బలమైనవో, ఎంత అసత్యమైనవో నాకు ఇప్పటికీ జ్ఞాపకం ఉంది. 1971 నవంబరులో శ్రీల ప్రభుపాదులవారిని కొంచెం సేపు సందర్శించాను. తరువాత కొంత కాలానికే నేను శాకాహారి నవడానికి నిశ్చయించుకున్నాను. (నేను శాకాహారిని అని నేను పొంగిపోతూ ఉంటే పావురాలు కూడా శాకాహారులే అన్న సంగతిని వారు నా దృష్టికి తెచ్చారు.)

1972 ఫిబ్రవరిలో కలకత్తాకు ఉత్తరాన డెబ్బయి మైళ్ళ దూరంలో ఉన్న చైతన్య మహాప్రభువు జన్మస్థలం అయిన మాయాపూర్‌లో ఒక ఉత్సవానికి ప్రభుపాదుల వారి శిష్యులు కొందరు నన్ను ఆహ్వానించారు. శ్రీకృష్ణుని అవతారంగా భావించబడుతున్న శ్రీ చైతన్య మహాప్రభువు పట్ల భక్తిగౌరవాల చిహ్నంగా ఆ ఉత్సవం జరుగబోతూంది. అప్పుడు నేను నేపాల్ సందర్శించే ప్రయత్నంలో ఉన్నాను. కాని శాంతి సైన్యం నాకు భారతదేశాన్ని విడిచి వెళ్ళడానికి అనుమతి ఇవ్వకపోవడం చేత నేను మాయాపూర్‌కు వెళ్ళాను.

మాయాపూర్‌కు వెళ్ళేటప్పుడు రెండే రోజులు అక్కడ ఉందా మనుకున్నాను; కాని వారం రోజులు ఉండిపోయాను. ఆ ద్వీపంలో భక్తుడు కాని పాశ్చాత్యుడను నేనొక్కణ్ణే. ఆ కృష్ణ భక్తులతో వారి దేశంలో ఉన్నాను గనుక కృష్ణ చైతన్యాన్ని గురించి చాలా చక్కగా తెలిసికోడానికి అది నాకొక గొప్ప అవకాశం అయింది.

ఆ ఉత్సవంలో మూడవ రోజున నన్ను శ్రీల ప్రభుపాదుల దర్శనానికి తీసుకువెళ్లారు. శ్రీల ప్రభుపాదులు సగం ఇటుకలతోనూ, సగం తడికెల తోనూ నిర్మించిన ఒక చిన్న కుటీరంలో నివసిస్తున్నారు. అందులో రెండు మూడు సాధారణమైన కుర్చీలూ, బల్లలూ ఉన్నాయి. శ్రీల ప్రభుపాదులు నన్ను కూర్చోమని, కుశల మడిగి, "ప్రశ్నలేమైనా అడుగుతారా?" అని అన్నారు. శ్రీల ప్రభుపాదులు ఆధ్యాత్మిక గురుపరం పరకు చెందినవారు కాబట్టి ఎలాంటి ప్రశ్నకైనా సమాధానం చెప్పగల రని అక్కడి శిష్యులు చెప్పారు. ప్రపంచంలో ఎక్కడ ఏమి జరుగుతూందో శ్రీల ప్రభుపాదులకు నిజంగా తెలుస్తుందనే నేను భావించాను. ఆయన శిష్యులు చెప్పుకుంటున్నది అదే కదా! వారి అభిప్రాయాలను నేను

గౌరవించాను. ఆ గౌరవంతోనే నేను ప్రశ్నలు వేయసాగాను. వినయపూర్వకంగా ఆధ్యాత్మిక జీవితం గురించి ప్రశ్నించడం వల్ల అప్రయత్నంగా నాకు ఆధ్యాత్మిక గురువు లభించారు.

నా విషయంలో శ్రీల ప్రభుపాదులు సంతోషించినట్లు కనిపించారు. తరువాత కొన్ని దినాల వరకు నా ప్రశ్నలకు సమాధానాలు ఇస్తూనే ఉన్నారు. వాటిని చాలా వరకు నేను కుతూహలంతోనే అడిగాను. కాని ఆయన అనుభవ పూర్వకంగా సమాధానాలు ఇవ్వడం వల్ల నా జీవితం ఆధ్యాత్మికం అయింది. ఆయన సమాధానాలు హేతుబద్ధంగానూ, శాస్త్రసమ్మతంగానూ, తృప్తికరంగానూ, ఆశ్చర్యకరమైన తియ్యని శైలిలోనూ ఉండేవి. శ్రీల ప్రభుపాదులను, వారి శిష్యులను దర్శించక పూర్వం ఆధ్యాత్మిక జీవితం అంటే నాకు ఎప్పుడూ అయోమయంగానూ, అస్పష్టంగానూ ఉండేది. కాని, శ్రీల ప్రభుపాదులతో నా చర్చలు అనుభవ సమ్మతాలుగానూ, విస్పష్టంగానూ, పులకాంకురం కలిగించేవిగానూ ఉండేవి. భగవంతుడు అంటే కృష్ణుడు నిరతిశయానందమయు డనీ, పరమమిత్రు డనీ, సర్వభోక్త అనీ నాకు తెలియజేయడానికి ఆయన ఎంతో ఓర్పుతో ప్రయత్నించారు. స్పష్టంగా తెలుస్తున్నవాటికి కూడా నేను ఎన్నో అభ్యంతరాలు చెప్పాను. భగవత్ చైతన్యం గురించి తీవ్రంగా ఆలోచిస్తే భగవంతుణ్ణి మరింతగా అవగతం చేసుకోవచ్చుననే ఉద్దేశ్యంతో అలా చేశాను. శ్రీల ప్రభుపాదుల వారు ఎంతో దయతో నిర్విరామంగా ప్రశ్నించడానికి నన్ను ప్రోత్సహించారు. నా భావాలను ప్రకటించడానికి నా సామర్థ్యం చాలా స్వల్పమే అయినప్పటికీ శ్రీల ప్రభుపాదులు నా ప్రతి ప్రశ్ననూ అర్థం చేసుకుని సంపూర్ణంగా సమాధానా లిచ్చారు.

బాబ్ కోహెన్

ఆగస్ట్ 14, 1974

# 1. కృష్ణుడు సర్వాకర్షకుడు

## ఫిబ్రవరి 27, 1972

**బాబ్** : శాస్త్రజ్ఞుడెవరు?

**శ్రీల ప్రభుపాదులు** : విషయాలు యథాతథంగా తెలిసిన వాడు.

**బాబ్** : విషయాలు తనకు యథాతథంగా తెలుసునని అనుకునే వాడు.

**శ్రీల ప్రభుపాదులు** : అంటే?

**బాబ్** : విషయాలు యథాతథంగా తనకు తెలుసునని భావించేవాడు.

**శ్రీల ప్రభుపాదులు** : కాదు. అతనికి తెలుసునని లోకం నమ్ముతుంది. విషయాలు అతనికి యథాతథంగా తెలుసునని నమ్ముతున్నాము. గనుకే మనం శాస్త్రజ్ఞుణ్ణి ఆశ్రయిస్తున్నాము. శాస్త్రజ్ఞుడు అంటే విషయాలను ఉన్నవాటిని ఉన్నట్లుగా తెలిసికొన్నవాడు. కృష్ణుడు అంటే "సమస్తాన్నీ ఆకర్షించేవాడు."

**బాబ్** : సర్వాకర్షకుడన్నమాట!

**శ్రీల ప్రభుపాదులు** : అవును. సర్వాకర్షణ లేకపోతే ఆయన భగవంతు డెలా అవుతాడు? ఆకర్షకుడైన వాడు ప్రముఖు డవుతాడు. కాదా?

**బాబ్** : నిజమే.

**శ్రీల ప్రభుపాదులు** : కాబట్టి భగవంతుడు ఆకర్షణ శక్తి కలవాడై ఉండాలి. అందరికీ ఆకర్షకుడుగా ఉండాలి. కాబట్టి దేవుడికి పేరేమైనా ఉంటే, లేక దేవుడికి మీరేదైన పేరు పెట్టదలచుకుంటే 'కృష్ణ' అనే పెట్టాలి.

**బాబ్** : 'కృష్ణ' అన్న పేరే ఎందుకు పెట్టాలి?

**శ్రీల ప్రభుపాదులు** : ఎందుకంటే అతడు సర్వాన్నీ ఆకర్షించే వాడు గనుక. కృష్ణుడు అంటే సర్వాన్నీ ఆకర్షించేవాడని అర్థం.

**బాబ్** : ఓహో! అలాగా?

**శ్రీల ప్రభుపాదులు** : ఔను. భగవంతుడికి పేరు లేదు. కాని ఆయన గుణాలను బట్టి మనం ఆయనకు పేర్లు పెడుతాము. ఎవడైనా అందంగా ఉంటే అతణ్ణి 'అందగాడు' అని పిలుస్తాము. ఎవడైనా బాగా తెలివిగా ఉంటే 'తెలివిగలవాడు' అని పిలుస్తాము. కాబట్టి గుణాన్ని బట్టి పేరు వస్తుంది. దేవుడు సర్వాన్నీ ఆకర్షిస్తాడు కాబట్టి 'కృష్ణ' అనే పేరు అతనికే వర్తిస్తుంది. 'కృష్ణుడు' అంటే సర్వాన్నీ ఆకర్షించేవాడని అర్థం. దాంట్లోనే అంతా ఇమిడి ఉంది.

**బాబ్** : కాని, 'సర్వశక్తిమంతుడు' అనే పేరు గురించి ఏమంటారు?

**శ్రీల ప్రభుపాదులు** : నిజమే... మీరు సర్వశక్తిమంతులు కాకపోతే సర్వాన్నీ ఎలా ఆకర్షిస్తారు?

**శ్యామసుందర దాస్** [ఒక అమెరికన్ శిష్యుడు, శ్రీల ప్రభుపాదుల కార్యదర్శి] : అన్నీ ఆయనలోనే ఉన్నాయా?

**శ్రీల ప్రభుపాదులు** : సమస్తం ఉన్నాయి. ఆయన చాలా అందగాడై ఉండాలి, చాలా జ్ఞానం కలిగి ఉండాలి. గొప్ప శక్తిమంతుడై ఉండాలి. ఎంతో కీర్తి కలవాడై ఉండాలి...

**బాబ్** : కృష్ణుడు దుర్మార్గులను కూడా ఆకర్షిస్తాడా?

**శ్రీల ప్రభుపాదులు** : ఆహా! తప్పకుండా! అతడు అందరికంటె ఎక్కువ దుర్మార్గుడు కూడా!

**బాబ్** : అదెలాగ?

**శ్రీల ప్రభుపాదులు** [నవ్వుతూ] : గోపికలను ఎప్పుడూ ఏడిపిస్తూ ఉంటాడు కాబట్టి.

**శ్యామసుందర దాస్** : ఏడిపించడమా?

**శ్రీల ప్రభుపాదులు** : ఔను. కొన్ని సార్లు రాధారాణి బయటకు వెళ్ళినప్పుడు కృష్ణుడు ఆమెను కొడతాడు, ఆమె క్రింద పడుతుంది - "కృష్ణా! నన్ను ఇలా



బాధపెట్టకు" అంటుంది. అప్పుడు ఇద్దరూ క్రింద పడతారు, కృష్ణుడు ఆమెను చుంబిస్తాడు. [నవ్వుతారు.] రాధారాణి చాలా సంతోషిస్తుంది. కృష్ణుడు పైకి చాలా అల్లరివాడుగా కన్పిస్తాడు. అల్లరి అంటే ప్రీతి కృష్ణునిలో లేకపోతే ప్రపంచంలో ఎలా ఉంటుంది? భగవంతుణ్ణి గురించి మన సూత్రం ఏమిటంటే సర్వానికీ అతడే మూలమని. అల్లరి అంటే ప్రీతి కృష్ణునిలో లేకపోతే దాని ప్రకటన ఎలా జరుగుతుంది? అన్నిటికీ అతడే మూలం కాబట్టి అది కూడా జరుగుతూంది. అయితే అతని అల్లరి అందరూ పూజించేటంత అందంగా ఉంది.

**బాబ్** : మరి చెడ్డవారి అల్లరి పనుల మాటేమిటి?

**శ్రీల ప్రభుపాదులు** : అల్లరి పెట్టడం మంచిది కాదు. కాని, కృష్ణుడు సర్వాతీతుడు. అతడు దేవదేవుడు. కాబట్టి అతని అల్లరి పనులు కూడా మంచివే. శ్రీకృష్ణుడు శుభస్వరూపుడు; భగవంతుడు; శుభంకరుడు.

**బాబ్** : ఔను.

**శ్రీల ప్రభుపాదులు** : కాబట్టి, అతడు అల్లరిపెట్టే వాడైతే అది కూడా శుభమే. అదే కృష్ణుడంటే. కృష్ణుడు అల్లరి పెట్టినప్పుడు, అతడు సర్వదోషాలకు అతీతుడు అయిన శుభుడు గనుక ఆ అల్లరి పెట్టడం కూడ శుభమే. ఇది ప్రతీవాడూ అర్థం చేసుకోవాలి.

**బాబ్** : కృష్ణుని చేత ఆకర్షింపబడని వారు కొందరు ఉంటారా?

**శ్రీల ప్రభుపాదులు** : ఉండరు. సర్వజనులను కృష్ణుడు ఆకర్షిస్తాడు. అలా ఆకర్షింపబడని వారు ఎవరు? ఏదీ "ఇదిగో ఈ మనిషీ, ఈ వస్తువూ కృష్ణుని చేత ఆకర్షించ బడలేదు" అనడానికి దృష్టాంతం చెప్పండి. అలాంటి వాడిని ఒక్కణ్ణి చూపించండి.

**బాబ్** : తప్పు అని తనకు తెలిసిన దానిని చేసేవాడు, లేదా అధికారాన్ని గాని, అంతస్తుని గాని, ధనాన్ని గాని సంపాదించ గోరేవాడు...

**శ్రీల ప్రభుపాదులు** : అవును.

**బాబ్** : ... అతనికి కృష్ణుడు ఆకర్షకుడుగా కనిపించక పోవచ్చును. అతనిని పాపిగా చేశాడు కాబట్టి కృష్ణుని ఆకర్షణ అతనికి కలుగక పోవచ్చును.

**శ్రీల ప్రభుపాదులు** : అలాకాదు. అతనికి భగవంతుడంటే ఆకర్షణ లేకపోలేదు. మంచి అధికారం సంపాదించాలనేది అతనిని ఆకర్షించింది. మనిషి శక్తిమంతుడు లేక ధనవంతుడు కావాలని కోరుకుంటాడు. అవునా? అయితే కృష్ణుని కంటె ధనవంతు డుండడు గనుక కృష్ణుడంటే అతనికి కూడ ఆకర్షణ ఉందన్న మాటే!

**బాబ్** : ఎవ్వడైనా ధనవంతుడు కావాలని కృష్ణుణ్ణి ప్రార్థిస్తే ధనవంతు డవుతాడా?

**శ్రీల ప్రభుపాదులు** : ఓ! తప్పకుండా అవుతాడు.

**బాబ్** : కేవలం ప్రార్థిస్తేనే అతడు భాగ్యవంతు డవుతాడా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును! కృష్ణుడు సర్వశక్తిమంతుడు కాబట్టి మీరు ధనవంతులు కావాలని కృష్ణుణ్ణి ప్రార్థిస్తే కృష్ణుడు మిమ్ము ధనవంతులను చేయగలడు.

**బాబ్** : ఎవడైనా దుర్మార్గంగా జీవిస్తూ కూడా ధనవంతు డవడానికి ప్రార్థిస్తే వాడు కూడా ధనవంతుడు కాగలడా?

**శ్రీల ప్రభుపాదులు** : తప్పకుండా. కృష్ణుణ్ణి ప్రార్థించడం దుర్మార్గం కాదు.

**బాబ్** : ఓహో! అలాగా?

**శ్రీల ప్రభుపాదులు** [నవ్వును ఆపుకుంటూ] : ఎలాగైతేనేమి? వాడు కృష్ణుణ్ణి ప్రార్థించాడు. కాబట్టి వాడు దుర్మార్గు డని మీరనలేరు.

**బాబ్** : ఔను.

**శ్రీల ప్రభుపాదులు** : భగవద్గీత(9.30)లో : "అపి చే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్ " అని శ్రీకృష్ణు డన్నాడు. మీరు దానిని చదివారా?

**బాబ్** : చదివాను. కాని నాకు సంస్కృతం రాదు. దాని ఇంగ్లీషు అనువాదం చదివాను.

**శ్రీల ప్రభుపాదులు** : ఓహో!



**బాబ్** : "చాలా దుర్మార్గుడైనా నన్ను ప్రార్థిస్తే ..."

**శ్రీల ప్రభుపాదులు** : ఊఁ చెప్పండి.

**బాబ్** : "... వాడు ఉద్ధరింపబడగలడు."

**శ్రీల ప్రభుపాదులు** : శ్రీకృష్ణుణ్ణి ప్రార్థించడం మొదలు పెట్టగానే అది శుభం కాబట్టి కృష్ణుడు ఆకర్షించడం ప్రారంభిస్తాడు. దేవదేవుడు ఆనందమయుడని వేదాలలో ఉంది - "రసో వై సః" అని. ప్రతివాడూ ఏదో ఒకదానిని తీవ్రంగా కోరుకుంటాడు. ఎందువల్ల? అందులో వాడికి ఏదో ఆనందదాయకమైనది ఉందని తెలుసు గనుక.

**బాబ్** : క్షమించండి.

**శ్రీల ప్రభుపాదులు** : అదో సుఖకరమైన విషయం. ఒకడు మద్యం త్రాగుతున్నాడనుకోండి. ఎందుకు త్రాగుతున్నాడు? ఆ త్రాగుడులో వాడికేదో సుఖం ఉంది. ఒకడు ధనం కోసం ప్రయాస పడుతాడు; ధనం దొరకితే దాంతో ఏదో సుఖం పొందగలడు కాబట్టి.

**బాబ్** : ఆ మధురమైన సుఖం అంటే ఏమిటి?

**శ్రీల ప్రభుపాదులు** [శ్యామసుందర్‌తో] : మధురమైన అనే పదాన్ని వారే విధంగా వర్ణిస్తారు?

**శ్యామసుందర దాస్** : రుచికరమైన, ఆనందకరమైన.

**బాబ్** : సరే.

**శ్రీల ప్రభుపాదులు** : ఆనందకరమైన రుచి. అందుకే వేదాలు "రసో వై సః" అంటున్నాయి. 'మెలో' అనే ఆంగ్లపదానికి 'రసః' అనేది సరియైన అర్థం. [అంతలో శ్యామసుందర దాస్ భార్య మాలతి ఒక తినుబండారపు పళ్ళెంతో అక్కడకు వస్తుంది.] ఏమిటది?

**మాలతి** : వంకాయ వేపుడు.

**శ్రీల ప్రభుపాదులు** : ఓహో! అందరినీ ఆకర్షించేది. అందరినీ ఆకర్షించేది!

[నవ్వు.]
**శ్యామసుందర దాస్** : కృష్ణుడు మహావిజ్ఞాన శాస్త్రవేత్త అంటారు. ఎలాగ?
**శ్రీల ప్రభుపాదులు** : ఎలాగంటే కృష్ణుడు సర్వజ్ఞుడు కాబట్టి. విజ్ఞాన శాస్త్రజ్ఞుడంటే ఒక విషయాన్ని పూర్తిగా తెలుసుకున్నవాడు. సర్వజ్ఞుడు కాబట్టి కృష్ణుడు శాస్త్రవేత్త కూడా అవుతాడు.
**బాబ్** : నేను విజ్ఞాన శాస్త్రోపాధ్యాయుణ్ణి.
**శ్రీల ప్రభుపాదులు** : అవును. మీరు ఉపాధ్యాయులు కాని, మీరు సంపూర్ణ జ్ఞానం లేకపోయినా ఎలా నేర్పగలరు అన్నది నా ప్రశ్న.
**బాబ్** : సంపూర్ణ జ్ఞానం లేకపోయినా బోధించవచ్చును...
**శ్రీల ప్రభుపాదులు** : అది మోసం. బోధన కాదు. అది మోసం. విజ్ఞాన శాస్త్రజ్ఞులు ఇలా అంటారు: "ఒక పదార్థపు ముద్ద ఉంది... సృష్టి సంభవించింది... బహుశః... కావచ్చు..." ఏమిటి దంతా? కేవలం మోసం. అది 'టీచింగ్' (బోధించడం) కాదు. 'చీటింగ్' (మోసం చేయడం).
**బాబ్** : ఇవాళ ఉదయం మీరు అన్నది నన్ను మళ్ళీ చెప్పనివ్వండి, అది చాల ఆసక్తికరంగా ఉంది. నేను అద్భుతాలు గురించి అడిగితే మూఢులు మాత్రమే అద్భుతాలను నమ్ముతారని మీరు అన్నారు. మీరు ఒక చిన్నపిల్లవాడు అనుకుందాం. పెద్దవాడు ఆ బల్లను ఎత్తడం మీకు అద్భుతం. మీరు రసాయన శాస్త్రజ్ఞులు. ఒక ఆమ్లాన్ని ఆధారద్రవ్యంతో కలిపారనుకోండి అప్పుడు పొగ వస్తుంది లేదా బ్రద్దలవుతుంది. లేదా ఇంకొకటేదో జరుగుతుంది. తెలియని వారికి అదొక అద్భుతంగా కనిపిస్తుంది. అయితే ప్రతి దానికీ ఒక పరిణామక్రమం ఉంటుంది. కాబట్టి మీకు ఏదైనా అద్భుతంలాకనబడిందంటే, దాని పరిణామ క్రమం మీకు తెలియదన్న మాట. కాబట్టి మూఢుడు మాత్రమే అద్భుతాలను నమ్ముతాడు... నేను చెప్పినదాంట్లో తప్పుంటే మీరు సరిదిద్దవచ్చును...
**శ్రీల ప్రభుపాదులు** : సరిగ్గానే ఉంది.



**బాబ్** : యేసుక్రీస్తు అవతరించినప్పుడు ఆ కాలంలో ప్రజలకు ఇప్పటి వాళ్ల కంటె అజ్ఞానం ఎక్కువ కాబట్టి అద్భుతాల ప్రదర్శన వారి జ్ఞానోదయానికి ఎక్కువ సహకరించిందని మీరన్నారు. నేను సరిగానే అర్థం చేసుకున్నానంటారా?
**శ్రీల ప్రభుపాదులు** : అంతే! జ్ఞానం లేని వారికి మాత్రమే అద్భుతాల అవసరం ఉంటుంది.
**బాబ్** : నేను అడుగుతున్నది భారత దేశంలో అద్భుతాలు చూపించే వారి విషయం.
**శ్రీల ప్రభుపాదులు** : కృష్ణుడు అందరి కంటె ఎక్కువ అద్భుతాలు (మాహాత్మ్యాలు) చూపించాడు.
**బాబ్** : అలాగా?
**శ్రీల ప్రభుపాదులు** : కుంతి ఆ సంగతిని వివరించింది...
**బాబ్** : సంపూర్ణ జ్ఞానం లేకుండా నేనేమీ నేర్పలేనా? ఉదాహరణకు, నేను...
**శ్రీల ప్రభుపాదులు** : మీకు తెలిసినంత వరకు మీరు నేర్పగలరు.
**బాబ్** : అవును. అయితే నాకు తెలిసిన దాని కంటె ఎక్కువ నేర్పగలనని నేను అనకూడదు.
**శ్రీల ప్రభుపాదులు** : అవును. అది మోసం అవుతుంది.
**శ్యామసుందర దాస్** : అంటే, అసంపూర్ణ జ్ఞానంతో ఎవ్వరూ సత్యాన్ని బోధించలేరు - అంతే గదా!
**శ్రీల ప్రభుపాదులు** : అవును. అది ఏ మానవుడికీ సాధ్యం కాదు. మానవుని ఇంద్రియాలు అసంపూర్ణాలు కాబట్టి సంపూర్ణ జ్ఞానం ఎలా బోధించ గలడు? మీకు సూర్యుడు ఒక బిళ్ళలా కనిపిస్తా డనుకోండి, సూర్యుణ్ణి సమీపించడానికి మీకు సాధనం లేదు. దూరదర్శిని (దుర్భిణి) మొదలైన సాధనాలతో సూర్యుణ్ణి చూడగలం అంటారా, అవి కూడా మీరు నిర్మించినవే కదా! మీరే పరిపూర్ణులు కారు. ఇక మీ యంత్రాలు ఎలా పరిపూర్ణము లవుతాయి? కాబట్టి సూర్యుని

గురించిన మీ జ్ఞానం అసంపూర్ణం. అందుచేత సంపూర్ణ జ్ఞానం లేకుండా సూర్యుణ్ణి గురించి బోధించవద్దు. అది మోసం అవుతుంది.

**బాబ్** : అలా అయితే సూర్యుడు భూమికి 9,30,00,000 మైళ్ళ దూరంలో ఉన్నాడని అంచనా అని బోధించడం గురించి మీరు ఏమంటారు?

**శ్రీల ప్రభుపాదులు** : అంచనా అంటేనే అది శాస్త్రీయం కాదని అర్థం.

**బాబ్** : అలా అయితే ఇంచుమించుగా విజ్ఞాన శాస్త్రమనేది అంతా శాస్త్రీయం కాదనుకుంటాను.

**శ్రీల ప్రభుపాదులు** : ఆ మాట నిజం!

**బాబ్** : విజ్ఞాన శాస్త్రమంతా ఏవో ఊహలపైన ఆధారపడిందే గదా!

**శ్రీల ప్రభుపాదులు** : అవును. వారి బోధన అసమగ్రం; అది కూడా చంద్రుణ్ణి గురించి వారు చేసే ఆకర్షణీయమైన ప్రకటన లాంటిదే. వారి జ్ఞానం సంపూర్ణమని మీ రనుకుంటున్నారా?

**బాబ్** : లేదు.

**శ్రీల ప్రభుపాదులు** : మరి?

**బాబ్** : సంఘంలో ఉపాధ్యాయుని సరియైన కర్తవ్యం ఏమిటి? విజ్ఞాన శాస్త్రోపాధ్యాయుణ్ణి తీసుకుందాం. తరగతి గదిలో అతడు ఏం బోధించాలి!

**శ్రీల ప్రభుపాదులు** : తరగతి గదిలోనా? కేవలం కృష్ణుణ్ణి గురించి బోధించాలి.

**బాబ్** : అతడు... మరో దాన్ని గురించి బోధింప...

**శ్రీల ప్రభుపాదులు** : కూడదు. కృష్ణుణ్ణి గురించి బోధిస్తే అన్నీ దానిలోనే ఉంటాయి. కృష్ణుణ్ణి తెలిసికోడమే అతని ఉద్దేశ్యం అయి ఉండాలి.

**బాబ్** : భౌతిక శాస్త్రజ్ఞుడెవడైనా ఆమ్లాన్ని క్షారపదార్థంతో కలిపే శాస్త్రాన్ని బోధిస్తూ, ఆ శాస్త్రాన్ని కృష్ణుని పార్శ్య విషయంగా చేసి బోధించ కూడదా?

**శ్రీల ప్రభుపాదులు** : అదెలా సాధ్యం?

**బాబ్** : విజ్ఞాన శాస్త్రాన్ని అభ్యసించే వాడు ప్రకృతి లక్షణాలను కనుగొంటాడు. వాటి సాధారణ లక్షణాలను గురించి, వాటిని నియంత్రించే శక్తిని గురించీ...



**శ్రీల ప్రభుపాదులు** : ఆ రోజున నేను వివరిస్తున్నది అదే. రసాయన నియమం ప్రకారం ఉదజని, ఆమ్లజని కలిసినప్పుడు నీరు అవుతుందా? లేదా? అని ఒక రసాయన శాస్త్రజ్ఞుణ్ణి అడిగాను. అవి నీరుగా మారుతాయి గదా?

**బాబ్** : నిజమే! మారుతాయి.

**శ్రీల ప్రభుపాదులు** : అయితే, అట్లాంటిక్, పసిఫిక్ మహా సముద్రాలలో అపారమైన నీళ్ళు ఉన్నాయి కదా? వాటి కోసం ఎంత మొత్తం రసాయనాలు సంపాదించాలి?

**బాబ్** : చాలా పెద్ద మొత్తం.

**శ్రీల ప్రభుపాదులు** : అవును. ఎన్ని టన్నులు?

**బాబ్** : చాలా టన్నులు.

**శ్రీల ప్రభుపాదులు** : అయితే వాటిని ఎవరు చేకూర్చారు?

**బాబ్** : భగవంతుడు సమకూర్చాడు.

**శ్రీల ప్రభుపాదులు** : ఎవరో ఒకరు సమకూర్చి ఉండాలి.

**బాబ్** : అవును.

**శ్రీల ప్రభుపాదులు** : కాబట్టి శాస్త్రం అంటే అది. మీరు ఆ విధంగా బోధించవలసి ఉంటుంది.

**బాబ్** : ఆమ్లాన్నీ, క్షారాన్నీ కలిపితే అదీ ఇదీ కాని మరో క్రొత్త పదార్థం తయారవుతుందని బోధించ వద్దంటారా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. నీళ్లలాగే బుడగలు వచ్చేవి చాలా ఉన్నాయి. అలా చేస్తున్నది ఎవరు? ఆమ్లాన్నీ, క్షారాన్నీ తెచ్చి ఇచ్చింది ఎవరు? [చాలా సేపు మౌనం.]

**బాబ్** : నీటికి మూలం ఏదో వీటికీ అదే!

**శ్రీల ప్రభుపాదులు** : అవును. ఉదజని, ఆమ్లజని లేకుండా మీరు నీటిని సృష్టించ లేరు. అందువల్ల ఈ అట్లాంటిక్ పసిఫిక్ మహా సముద్రాలే కాదు. లక్షల కొలదీ గ్రహాలు ఉన్నాయి, లక్షలకొలదీ అట్లాంటిక్, పసిఫిక్ వంటి మహా సముద్రా

లున్నాయి. ఎవరు ఉదజని, ఆమ్లజనులతో ఈ నీటిని సృష్టించారు? అవి ఎలా సమకూరాయి? అదీ నా ప్రశ్న. ఎవరో ఒకరు తెచ్చి ఉండాలి. లేకపోతే అవి ఎలా పుట్టాయి?

**బాబ్** : కాని, ఉదజని ఆమ్లజనులతో నీటిని సృష్టించడం ఎలాగో అది కూడా బోధించాలంటారా? ఆ రెండింటినీ కలిపి - అది కూడా బోధించాలా? అంటే ఉదజనిని ఆమ్లజనితో కలిపి కాల్చడం ఎలాగో...

**శ్రీల ప్రభుపాదులు** : అది ముఖ్యం కాదు. అది అంతగా కష్టమూ కాదు. మాలతి ఆ పూరీ చేసింది. అంటే పిండి ఉంది. నెయ్యి ఉంది. వాటితో ఆమె పూరీ చేసింది. ఆ పిండి గాని, నెయ్యి గాని లేకపోతే పూరీ చేయడానికి అవకాశం ఎక్కడిది? భగవద్గీతలో ఒక వాక్యం ఉంది: "నీరు, భూమి, వాయువు, అగ్ని - ఇవి నా శక్తులు." మీ శరీరం అంటే ఏమిటి? ఈ బాహ్య ప్రత్యక్ష శరీరం - మీ శక్తి. అది మీకు తెలుసా? మీ దేహం మీ శక్తి చేత నిర్మించబడింది. ఉదాహరణకు : నేను తింటున్నాను...

**బాబ్** : ఊం!

**శ్రీల ప్రభుపాదులు** : అంటే నేను కొంత శక్తిని సృష్టిస్తున్నాను. తద్వారా నా శరీరం పోషించబడుతూంది.

**బాబ్** : ఓహో! అర్థమయింది.

**శ్రీల ప్రభుపాదులు** : కాబట్టి మీ శరీరం మీ శక్తి చేత నిర్మించబడింది.

**బాబ్** : కాని, మీరు అన్నం తింటున్నప్పుడు ఆ అన్నంలో సూర్యుని శక్తి ఉంది గదా?

**శ్రీల ప్రభుపాదులు** : ఇందుకు నేనొక ఉదాహరణం ఇస్తాను. ఆహారం జీర్ణించుకోడం ద్వారా నేను కొంత శక్తిని సృష్టిస్తున్నాను. అది నా శరీరాన్ని నిలబెడుతుంది. మన శక్తి సృష్టి తగినంతగా లేకపోతే మన శరీరం దుర్బలమై వ్యాధిగ్రస్త మవుతుంది. మీ దేహం మీ స్వంత శక్తి చేతనే నిర్మించబడుతుంది. అదే విధంగా, ఈ విరాట్ దేహం - ఈ విశ్వం - కృష్ణుని శక్తి చేత నిర్మించబడింది. అది కాదని ఎలా



అనగలరు? మీ దేహం మీ శక్తి వలన నిర్మించబడినట్లే విశ్వ శరీరంకూడా ఎవరి శక్తి చేతనో నిర్మించబడి ఉండాలి కదా! అతడే కృష్ణుడు. [చాలా సేపు మౌనం.]

**బాబ్** : దీనిని అర్థం చేసుకోడానికి నేను ఇంకా ఆలోచించ వలసి ఉంటుంది.

**శ్రీల ప్రభుపాదులు** : ఇందులో ఆలోచించేది ఏముంది? ఇవి విస్పష్టం. [ఆయన నవ్వుతారు.] మీ వెంట్రుకలు ప్రతిదినం పెరుగుతున్నాయి కదా! ఎందువలన? మీలో కొంత శక్తి ఉంది కాబట్టి.

**బాబ్** : నేను ఆహారం వలన పొందే శక్తి.

**శ్రీల ప్రభుపాదులు** : ఎలా అయితే ఏమి? మీకు ఆ శక్తి వచ్చింది. ఆ శక్తి వలన మీ జుట్టు పెరుగుతూంది. కాబట్టి మీ శరీరం మీ శక్తిచేత నిర్మించబడినట్లే ఈ బ్రహ్మాండమైన సృష్టి అంతా భగవంతుని శక్తి చేత నిర్మించబడింది. అది వాస్తవం. అది మీ శక్తి కాదు గదా!

**బాబ్** : ఓహో! అవును. అర్థమయింది.

**ఒక శిష్యుడు** : ఎలా అంటే - విశ్వంలోని ఈ గ్రహాలన్నీ సూర్యశక్తే కదా - సూర్యశక్తి ద్వారా నిర్మించబడినవే కదా!

**శ్రీల ప్రభుపాదులు** : అవును మరి. ఆ సూర్యుణ్ణి సృష్టించిం దెవరు? అది కృష్ణశక్తి. ఎందు వలన? అది ఉష్ణం గనుక. కృష్ణ డేమన్నాడు? "భూమి రాపో నలో వాయుః" - "ఉష్ణం - అది నా శక్తి." కృష్ణుని ఉష్ణ శక్తికి సూర్యుడు ప్రతినిధి. అది మీ శక్తి కాదు. "సూర్యుణ్ణి నేను నిర్మించాను" అని మీరు అనలేరు. కాని ఎవరో నిర్మించి ఉండాలి. సూర్యుణ్ణి తానే నిర్మించానని కృష్ణుడు అంటున్నాడు. కాబట్టి మనం కృష్ణుణ్ణి నమ్ముతున్నాం. కనుక మనం కృష్ణునికి చెందిన వాళ్ళం.

**బాబ్** : కృష్ణునికి చెందిన వాళ్ళమా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. ఇప్పుడు మన జ్ఞానం సంపూర్ణం. ఉష్ణం కృష్ణుని శక్తి అని అంటే దానిని మీరు కాదనలేరు, అది మీ శక్తి కాదు కాబట్టి. మీ దేహంలో కొంత ఉష్ణం ఉంది. అదే విధంగా ఉష్ణం ఒకరి శక్తి అయి ఉండాలి. ఎవరా వ్యక్తి? కృష్ణుడు. "అవును అది నా శక్తే" అని కృష్ణు డన్నాడు. కాబట్టి నా విజ్ఞానం నిర్దుష్టం.

ఎందువలన? మహా విజ్ఞాన శాస్త్రజ్ఞుని వాక్యాన్ని నేను స్వీకరిస్తున్నాను గనుక నేనూ మహా విజ్ఞాన శాస్త్రజ్ఞుణ్ణే. వ్యక్తిగతంగా నేను మూఢుణ్ణి కావచ్చు. కాని, పరమ విజ్ఞాన శాస్త్రజ్ఞుని నుంచి జ్ఞానాన్ని పొందుతున్నాను. గనుక నేనూ పరమ విజ్ఞాన శాస్త్రజ్ఞుడినే. దీనితో నాకు ఎలాంటి చిక్కూ లేదు.

**బాబ్** : క్షమించండి.

**శ్రీల ప్రభుపాదులు** : పరమ విజ్ఞాన శాస్త్రజ్ఞుణ్ణి అవడంలో నాకేమీ ఇబ్బంది లేదు. ఎందువలన? పరమ విజ్ఞాన శాస్త్రజ్ఞుడి నుండి నేను జ్ఞానాన్ని గ్రహిస్తున్నాను. [చాలా సేపు మౌనం.] "ఈ భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, మనస్సు, బుద్ధి, అహంకారం - ఇవి నా నుంచి భిన్నములైన ఎనిమిది శక్తులు."

**బాబ్** : భిన్నములైన శక్తులా?

**శ్రీల ప్రభుపాదులు** : ఔను. పాలలాగ. ఈ పాలంటే ఏమిటి? ఆవు నుంచి వేరుపడిన శక్తి. [శ్యామసుందర్, బాబ్ కూడా తెల్లబోయి, అర్థం చేసుకుని నవ్వారు.] కాదా? అది అవు నుంచి వేరు పడిన శక్తి.

**శ్యామసుందర దాస్** : అది అవాంతర సృష్టి (బై ప్రాడక్ట్) లాంటిదా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును.

**బాబ్** : అయితే కృష్ణుని నుండి ఈ శక్తి విడిపోవడంలో అంతరార్థం ఏమిటి?

**శ్రీల ప్రభుపాదులు** : 'విడిపోయినది' అంటే అర్థం: ఇది ఆవు శరీరం నుంచి ఏర్పడింది గాని, ఆవు కాదు - అదే భిన్నత్వం అంటే!

**బాబ్** : కనుక, ఈ భూమీ, ఈ సమస్తం కృష్ణుని నుంచే పుట్టాయి గాని కృష్ణుడు కావు అంటారు.

**శ్రీల ప్రభుపాదులు** : అవును. కృష్ణుడు కావు. లేదా, ఏక కాలంలోనే అవీ కృష్ణుడే, కృష్ణుడు కావు కూడా - అని మీరు అనవచ్చును. అది మన వేదాంతం. ఒకటే కాని భిన్నం. ఇవి అన్నీ కృష్ణుని కంటె భిన్నము అని - వేరు అని చెప్పలేము. ఎందువలన అంటే కృష్ణుడు లేకపోతే, వీటికి ఉనికే లేదు. అలాగ అని : "నేను వీటినే పూజిస్తాను. కృష్ణుణ్ణి ఎందుకు పూజించాలి?" అని మీరు అనలేరు. సర్వమూ



దేవుడే కాబట్టి మనం ఏది చేసినా అది దేవుని పూజే అవుతుందని అద్వైతవాదులు అంటారు. అది మాయావాద సిద్ధాంతం. ఎందుచేతనంటే, ప్రతి వస్తువూ దేవుని చేత చేయబడింది కాబట్టి ప్రతి వస్తువూ దేవుడే అని. కాని మన సిద్ధాంతం ప్రతి వస్తువూ దేవుడే, దేవుడు కాదు కూడా అని.

**బాబ్** : అయితే, ఇంతకూ దేవుడంటే ఏమిటి? లోకంలో దేవు డనేది ఏమైనా ఉందా?

**శ్రీల ప్రభుపాదులు** : దేవదేవుని శక్తితో సమస్తం నిర్మించబడింది గనుక మీరు దేనిని పూజించినా దేవుణ్ణి పూజించినట్లే అని అర్థం చేసికోరాదు.

**బాబ్** : అయితే ఇక లోకంలో 'మాయ కానిది ఏమిటి?' అది...

**శ్రీల ప్రభుపాదులు** : 'మాయ' అంటే శక్తి. 'మాయ' అంటే అసత్యాన్ని చూచి సత్యమని భ్రమించడం అని మరొక అర్థం కూడా ఉంది. కాబట్టి మూఢులు శక్తినే శక్తిమంతు డని భ్రమిస్తారు. అదే 'మాయ' అంటే. అది సూర్యుని కాంతి లాంటిది. సూర్యకాంతి మీ గదిలో ప్రవేశిస్తుంది. అది సూర్యుని కాంతి మాత్రమే. అయితే సూర్య కాంతి మీ గదిలో ప్రవేశించింది కాబట్టి సూర్యుడు ప్రవేశించా డని అనలేరు. సూర్యుడు నిజంగా మీ గదిలో ప్రవేశిస్తే మీరూ, మీ గదీ అన్నీ వెంటనే నాశనమవుతాయి. సూర్యుడు ప్రవేశించాడని తెలుసుకోడానికి కూడా మీకు వ్యవధి ఉండదు. అవునా?

**బాబ్** : నిజమే!

**శ్రీల ప్రభుపాదులు** : కాని, సూర్యకాంతి సూర్యుడు కాదని కూడా చెప్పలేము. సూర్యుడు లేకపోతే సూర్యకాంతి ఎక్కడిది? కాబట్టి సూర్యకాంతి సూర్యుడు కాదని చెప్పలేము. అది సూర్యుడూ అవుతుంది; సూర్యుడు కానిదీ అవుతుంది, రెండూను, అదీ మన సిద్ధాంతం. 'అచింత్య భేదాభేదం'- చింతనాతీతం. భౌతిక దృష్ట్యా ఒకే వస్తువు అన్వయంగానూ, వ్యతిరేకంగానూ ఉండడం ఊహించలేము; దానిని మనం భావించలేము. అది అచింత్య శక్తి. సర్వమూ కృష్ణుని శక్తే కాబట్టి,

కృష్ణుడు ఏ శక్తి నుంచయినా ప్రకాశించవచ్చును. కాబట్టి, దేనితోనైనా - మట్టితో గాని, జలంతో గాని, మరి దేనితోగాని చేయబడిన రూపంలో కృష్ణుణ్ణి మనం పూజించినప్పుడు అది కృష్ణుడే! అది కృష్ణుడు కాదని మీరు అనలేరు. మనం లోహంతో చేసిన ఈ కృష్ణుణ్ణి (గుడిలోని విగ్రహం) పూజించినప్పుడు అది కృష్ణుడే. అది సత్యం. ఎందుచేత? లోహం కూడా కృష్ణుని శక్తే కనుక, అది కృష్ణుని కంటె భిన్నం కాదు. కృష్ణుడు తన శక్తితో సంపూర్ణంగా ప్రకాశించగలిగినంత సర్వశక్తిమంతుడు. కాబట్టి ఈ విగ్రహారాధన శిలాపూజ కాదు. మీకు దాని క్రమం తెలిస్తే అది దేవదేవుని ప్రత్యక్ష ఆరాధన అవుతుంది.

**బాబ్** : క్రమం తెలిస్తే దేవతా విగ్రహం కృష్ణు డవుతుందా?

**శ్రీల ప్రభుపాదులు** : అవడం కాదు. అది కృష్ణుడే.

**బాబ్** : క్రమం తెలిస్తే చాలా - ఆ దేవతా విగ్రహం కృష్ణుడవడానికి?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. ఈ విద్యుత్తంత్రిని చూడండి. ఇది విద్యుచ్ఛక్తి. కాని క్రమం తెలిసిన వాడే దాని నుండి విద్యుచ్ఛక్తిని సంపాదించగలడు.

**శ్యామసుందర దాస్** : లేకపోతే అది వట్టి తీగే అవుతుంది.

**శ్రీల ప్రభుపాదులు** : అవును. వట్టి తీగే.

**బాబ్** : అలా అయితే, నాకు ఆ క్రమం తెలియక పోతే నేనొక విగ్రహాన్ని నిర్మించినా అది కృష్ణుడు కాదన్నమాటేగా...

**శ్రీల ప్రభుపాదులు** : అది కృష్ణుడే! అది కృష్ణుడే అని తెలిసికొనే క్రమం మీరు తెలిసికోవలసి ఉంటుంది. అది కృష్ణుడే!

**బాబ్** : అది వట్టి మట్టీ, బురదా కాదు -

**శ్రీల ప్రభుపాదులు** : కాదు. కృష్ణుడు లేకపోతే మట్టికి విడిగా ఉనికి లేదు. "నా శక్తి" అని కృష్ణుడు చెబుతున్నాడు. మీరు శక్తిని శక్తిమంతుని నుండి విడదీయలేరు. అది సాధ్యంకాదు - ఉష్ణాన్ని అగ్ని నుండి విడదీయలేరు. కాని నిప్పు కన్న వేడి భిన్నం. వేడి తగులుతుంది. అంటే మీకు నిప్పు తగులుతుందని అర్థం కాదు.



అగ్ని ఉష్ణాన్ని కలుగజేసేదైనా దానికి విడిగా అస్తిత్వం ఉంది - అదే విధంగా కృష్ణుడు తన వివిధ శక్తులతో సమస్తాన్నీ సృష్టిస్తున్నప్పటికీ తాను కృష్ణుడు గానే ఉంటాడు. మాయావాదులు సర్వమూ కృష్ణుడు గనుక కృష్ణుడు ప్రత్యేకంగా లేడు అంటారు. అది భౌతికమైన ఆలోచన. ఉదాహరణకు ఈ పాలను నేను కొంచెం కొంచెంగా త్రాగివేస్తే పాలు మిగులవు. అవి నా కడుపులోకి పోతాయి. కృష్ణుడలా కాదు. అతడు సర్వశక్తిమంతుడు. మనం ఆయన శక్తిని నిర్విరామంగా ఉపయోగించుకుంటున్నాము. అయినా కృష్ణుడలాగే ఉన్నాడు; అక్కడే అవ్యయంగా నిలచిఉన్నాడు. హద్దు లేకుండా బిడ్డలను కంటూన్నవారు ఇంకా బ్రతికే ఉన్నట్లు కృష్ణు డున్నాడు. ఇది మోటు ఉపమానం. వందలకొలదీ బిడ్డలను కనడం వల్ల అతడు మరణించినట్లు కాదు. కృష్ణ భగవానుడు అనంత సంఖ్యలో సంతానాన్ని కంటున్నప్పటికీ, ఏమీ చెక్కుచెదరకుండా అలాగే ఉన్నాడు!

పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణ మేవావశిష్యతే

"భగవంతుడు పరిపూర్ణుడు కాబట్టి తననుంచి అనేక సంపూర్ణ వస్తువులు పుట్టినా, తాను పరిపూర్ణుడుగానే ఉంటాడు" ఇదీ కృష్ణ చైతన్యం. కృష్ణునికి అంతం లేదు. కృష్ణుడు అంతటి శక్తిమంతుడు కాబట్టే ఆయన సమస్తాన్నీ ఆకర్షిస్తాడు. ఇది కృష్ణుని శక్తి ప్రదర్శనకు ఒక వైపు మాత్రమే. కృష్ణునికి ఇంకా అపరిమితమైన అనేక శక్తు లున్నాయి. కృష్ణ శక్తి విజ్ఞాన అధ్యయనం ఒక చిన్న భాగం మాత్రమే. ఈ విధంగా కృష్ణ శక్తిని అధ్యయనం చేసుకుంటూ పోవడమే కృష్ణ చైతన్య మార్గం అంటారు. ఇదిమోసం కాదు. "కావచ్చును", "కాకపోవచ్చును" అనే ఊహలతో కూడింది కాదు. ఇది పరిపూర్ణ సత్యం.

**శ్యామసుందర దాస్** : మరి ఈ అధ్యయనానికి ఇక అంతు అనేది ఉండదా?

**శ్రీల ప్రభుపాదులు** : ఉండదు. ఎలా ఉంటుంది? కృష్ణుని శక్తి అనంతమైనది గదా!

# 2. వైదిక సంస్కృతి - వర్ణాశ్రమ ధర్మం

## ఫిబ్రవరి 28, 1972

**బాబ్** : "మీ అన్యోన్య సంబంధాలలో లైంగిక జీవితం గురించి మీ భావాలు ఏమిటి?" అని మీ శిష్యులను అడిగాను. వారెలా నడుచుకుంటారో నేను చూచాను. ఆ విధంగా నేను నడుచుకోగలనని అనుకోడం లేదు. ఈ వేసవి చివరన నేను పెళ్ళి చేసుకోబోతున్నాను.
**శ్రీల ప్రభుపాదులు** : ఊం!
**బాబ్** : ఈ వేసవి చివరన సెప్టెంబరులో గాని, ఆగస్ట్‌లో గాని అమెరికాకు తిరిగి వెళ్ళాక నేను పెళ్ళి చేసుకోబోతున్నాను. అయితే, గృహస్థులు సంతానం కోసం మాత్రమే సంభోగం చేస్తారని మీ శిష్యులు చెబుతున్నారు. ఆ స్థితిలో నన్ను నేను ఊహించుకోలేక పోతున్నాను. భౌతిక ప్రపంచంలో జీవించేవా డెటువంటి లైంగిక జీవితాన్ని గడుప గలడు?
**శ్రీల ప్రభుపాదులు** : వేదోక్త సిద్ధాంతం ప్రకారం స్త్రీ సంపర్కాన్ని పూర్తిగా వదలుకోవాలి. సమస్త వేదోక్త ధర్మాలకూ భౌతిక బంధాల నుంచి విడుదల పొందడం ఒక్కటే పరమ ప్రయోజనం. భౌతిక సుఖానుభూతికి విభిన్న విషయలంపటాలున్నా, స్త్రీ వ్యసనం అన్నిటినీ మించినది. శ్రీమద్భాగవతం ఇలా చెబుతూంది : ఈ భౌతిక ప్రపంచంలో...

పుంసః స్త్రియా మిథునీ భావమ్ ఏతమ్

పురుషులకు స్త్రీ ఆసక్తి, స్త్రీకి పురుషాసక్తి - మానవ సమాజంలోనే కాదు; పశు పక్ష్యాదులలో కూడ ఉంటుంది. ఆ కామమే భౌతిక జీవితానికి మూలమైనది గనుక స్త్రీలు పురుషసంగమం కొరకు, పురుషులు స్త్రీసంగమం కొరకు తీవ్రంగా



ఇలా చెప్పాను : "మీరు మిత్రులలాగ జీవించరాదు. వివాహం చేసుకోవాలి" అని.
**బాబ్** : చాలా మంది వివాహం కూడా పవిత్రం కాదనుకుంటున్నారు. అందుచేత వారు వివాహాన్ని కోరుకోడం లేదు. వివాహం అయిన తరువాత పరిస్థితులు బాగా ఉండక పోతే, వారు చాలా సులభంగా విడాకులు పుచ్చుకోగలుగుతున్నారు గదా!
**శ్రీల ప్రభుపాదులు** : అవును, అదీ నిజమే!
**బాబ్** : అందుకే వివాహం చేసుకోడంలో అర్థం లేదని కొందరు భావిస్తున్నారు.
**శ్రీల ప్రభుపాదులు** : వివాహం అంటే చట్టబద్ధమైన వ్యభిచారం అని వాళ్ళ ఉద్దేశ్యం. వారు ఆ విధంగా ఆలోచిస్తున్నారు. కాని నిజానికి అది వివాహం కాదు. ఆ క్రైస్తవ పత్రిక కూడా - దాని పేరేమిటి? 'వాచ్...'?
**శ్యామసుందర దాస్** : 'వాచ్‌టవర్'?
**శ్రీల ప్రభుపాదులు** : అవును. 'వాచ్‌టవర్'. ఒక పురోహితుడు ఇద్దరు పురుషుల మధ్య పెళ్ళికి అనుమతి ఇవ్వడాన్ని ఆ పత్రిక ఖండించింది. అది స్వలింగ మైథునం. కాబట్టి ఇటువంటివి అన్నీ జరుగుతూనే ఉన్నాయి. వివాహాన్ని కేవలం వ్యభిచారంగా భావిస్తున్నారు. అంతే! కాబట్టి : "అంత డబ్బు ఖర్చు పెట్టి ఒక వేశ్యను భరించడం వల్ల ప్రయోజనం ఏముంది? అది లేకపోవడమే మంచిది" అని జనం అనుకుంటున్నారు.
**శ్యామసుందర దాస్** : మీరు ఆవు, అంగడి ఉదాహరణ చెబుతూ ఉంటారు గదా!
**శ్రీల ప్రభుపాదులు** : అవును. అంగడిలో పాలు దొరుకుతూ ఉంటే ఆవును భరించడం ఎందుకు? [అంతా నవ్వుతారు.] పాశ్చాత్యదేశాలలో ఇది చాలా అసహ్యాకరమైన విషయం. నేను చూశాను. ఇక్కడ భారతదేశంలో కూడా క్రమంగా అదే పద్ధతి ఏర్పడుతూంది. కాబట్టి, ఆధ్యాత్మిక జీవిత మూల సూత్రాలను ప్రజలకు బోధించడానికి మేము ఈ కృష్ణ చైతన్యోద్యమాన్ని ప్రారంభించాము. ఇది ఏదో ఒక తెగకు సంబంధించిన మతోద్యమం కాదు. ఇది సర్వ మానవులకు మేలు చేకూర్చే సాంస్కృతిక ఉద్యమం.

# 3. జీవితానికి నిజమైన లక్ష్యం

## ఫిబ్రవరి 28, 1972

### (సంభాషణ తరువాయి భాగం)

**శ్రీల ప్రభుపాదులు** : ఈ ఉద్యమం ముఖ్యంగా మానవుడు తన నిజమైన గమ్యాన్ని చేరే శక్తిని చేకూర్చడానికి ఉద్దేశించబడింది.

**బాబ్** : భగవంతుణ్ణి తెలుసుకోడమే జీవితానికి నిజమైన గమ్యమా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. తిరిగి స్వంత ఇంటికి చేరుకోడం - దేవదేవుణ్ణి చేరుకోడం. అదే నిజమైన జీవితగమ్యం. సముద్రంలోని నీళ్ళు మేఘాలుగా మారుతాయి. ఆ మేఘాలు వర్షంగా భూమి మీద కురుస్తాయి. ఆ నీళ్ళు వాగులలో ప్రవహించి మళ్ళీ సముద్రంలో కలసి పోతాయి. అలా కలిసిపోవడమే వాటి ముఖ్యమైన గమ్యం. అలాగే మనం భగవంతుడి దగ్గర నుంచి వచ్చాము, ఇప్పుడు భౌతిక జీవితంలో చిక్కుకున్నాము. కాబట్టి క్లిష్టమైన ఈ స్థితి నుంచి బైట పడి తిరిగి ఇంటికి చేరడం (అంటే భగవంతుని చేరడం) మనకు ముఖ్య ధ్యేయమై ఉండాలి. ఇదే మానవ జన్మకు నిజమైన చారితార్థ్యం.

మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్
నాప్నువన్తి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః

"నన్ను పొందిన పిమ్మట భక్తి యోగులైన మహాత్ములు అత్యున్నతమైన సిద్ధిని పొందిన వారవడం వల్ల దుఃఖాలకు నిలయమైన ఈ అనిత్య ప్రపంచానికి తిరిగి రారు." (భ.గీ. 8.15) భగవద్గీత ఇలా చెబుతూంది: ఎవరైనా నా దగ్గరకు చేరితే "మాముపేత్య"- వారు మళ్ళీ వెనుకకు వెళ్ళరు. అంటే ఎక్కడికి? ఈ ప్రదేశానికి: 'దుఃఖాలయ మశాశ్వతమ్.' ఈ ప్రదేశం దుఃఖాలకు పుట్టినిల్లు అంటే ఈ



ప్రపంచం దుఃఖమయ మని. ఇది ప్రతివారికీ తెలుసు కాని, వారు నాయకు లనబడే వారి చేత మోసగించబడుతున్నారు. భౌతిక జీవనం దుఃఖమయం. కృష్ణుడు - అంటే భగవంతుడు - ఈ చోటును 'దుఃఖాలయమ్' అంటున్నాడు. ఇది 'అశాశ్వతమ్' కూడా. అనిత్యం కూడా. ఇందులో రాజీ ప్రసక్తే లేదు: "సరే! దుఃఖాల నిలయమే కానివ్వండి. నేను అమెరికనుగానో, భారతీయుడుగానో ఇక్కడే ఉంటాను" అనడానికి వీలులేదు. అది కూడా మీరు చేయలేరు. మీరు అమెరికాలో ఉండలేరు. అమెరికాలో జన్మించడం వల్ల చాలా సుఖంగా ఉన్నారని మీరు భావించవచ్చును. కాని అమెరికాలో ఎక్కువ కాలం ఉండలేరు. అక్కడ నుంచి ఎవరైనా తన్ని పంపివేయవచ్చును. మరి మీ పునర్జన్మ ఏమిటో మీకు తెలియదు. కాబట్టి ఇది 'దుఃఖాలయ మశాశ్వతమ్' అంటే సుఖం లేనిది. నిత్యం కానిది. ఇదీ మా సిద్ధాంతం.

**బాబ్** : అయితే. భగవంతుని గురించి కొంత జ్ఞానం కలిగితే జీవితం దుఃఖమయంగా ఉండదా?

**శ్రీల ప్రభుపాదులు** : ఉండదు. ఏదో కొంత జ్ఞానం పనికి రాదు. సంపూర్ణ జ్ఞానం అవసరం.

జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః

'తత్త్వతః' అంటే 'సంపూర్ణంగా' అని అర్థం. సంపూర్ణ జ్ఞానం భగవద్గీతలో చెప్పబడింది. కాబట్టి మానవ సంఘంలోని ప్రతి వారికీ భగవద్గీత యథాతథంను చదువుకొని జన్మను సార్థకం చేసుకోడానికి అవకాశం కల్పిస్తున్నాము. అదే కృష్ణ చైతన్యోద్యమం. మీ భౌతిక శాస్త్రం పునర్జన్మను గురించి ఏం చెబుతుంది?

**బాబ్** : ఆ శాస్త్రం పునర్జన్మ లేదని గాని, ఉందని గాని చెప్పలేదు. దానికి ఆ విషయం తెలియదు... అనుకుంటాను.

**శ్రీల ప్రభుపాదులు** : కాబట్టి ఆ శాస్త్రం అసంపూర్ణం అని నేను అంటున్నాను.

**బాబ్** : అయినా, ఆ శాస్త్రం కొంత చెప్పగలదు. శక్తి ఎప్పటికీ నశించదనీ, కేవలం మారుతూంటుందనీ అది చెబుతూ ఉంది.

**శ్రీల ప్రభుపాదులు** : అది బాగానే ఉంది. కాని, ఆ శక్తి భవిష్యత్తులో ఎలా ప్రవర్తిస్తుందో భౌతిక శాస్త్రానికి తెలియదు. శక్తి ఏ విధంగా తన మార్గాన్ని మారుస్తూంది? శక్తి వివిధాలైన నిర్వహణలతో వివిధాలుగా ఎలా పని చేస్తూంది? ఉదాహరణకు విద్యుచ్ఛక్తి రకరకాలుగా ఉపయోగిస్తే,నీళ్ళు కాచుకోడానికీ దానికీ పనికి వస్తుంది, రెఫ్రిజిరేటరును నడుపుతుంది. నిజానికి ఆ రెండు ప్రయోజనాలూ పరస్పర విరుద్ధాలు. కాని విద్యుచ్ఛక్తి మాత్రం ఒక్కటే. అదే విధంగా ఈ శక్తి - ప్రాణశక్తి ఏ విధంగా తన గతులను మార్చుకుంటూంది? ఏ దిక్కుగా వెడుతూంది? అది పునర్జన్మలో ఏ విధంగా ఫలిస్తుంది? అది వారికి తెలీదు. కాని భగవద్గీతలో ఎంతో చక్కగా ఆ విషయం వివరించబడింది:

వాసాంసి జీర్ణాని యథా విహాయ

మీరు ఒక వస్త్రాన్ని ధరించారు. ఆ వస్త్రం పనికి రానప్పుడు మీరు దానిని మారుస్తారు. అదే విధంగా, ఈ దేహం ఒక కమీజు లేక కోటు వంటిది. అది ఇక ఏ మాత్రం పనికి రాక పోతే, దానిని మనం మార్చవలసి ఉంటుంది.

**బాబ్** : ఆ మార్చవలసిన 'మనం' అనేది ఏమిటి? మారనిది ఏమిటి?

**శ్రీల ప్రభుపాదులు** : అది ఆత్మ.

**బాబ్** : ఒక జీవితం నుంచి మరొక జీవితానికా?

**శ్రీల ప్రభుపాదులు** : అదే ఆత్మ - నేను ఏ 'నీవు' మాట్లాడుతున్నావు? ఏ 'నేను' మాట్లాడుతున్నాను? అదే ఆత్మ లేక జీవుడు.

**బాబ్** : నా ఆత్మకీ, మీ ఆత్మకీ తేడా ఉందా?

**శ్రీల ప్రభుపాదులు** : ఉంది. మీరొక ప్రత్యేకమైన ఆత్మ. నేనొక ప్రత్యేకమైన ఆత్మను.

**బాబ్** : మిమ్మల్ని మీరు కర్మఫల హేతువుల నుంచి విముక్తులను చేసుకున్నారు.



వాంఛిస్తూ ఉంటారు. నవలలు, నాటకాలు, చలన చిత్రాలు, నిత్యం మనం చూసే సామాన్యమైన ప్రకటనలు అన్నీ స్త్రీ పురుషుల మధ్య ఆకర్షణనే సామాన్యంగా వర్ణిస్తాయి. దర్జీవాని దుకాణంలో కూడా కిటికీలలో స్త్రీ పురుషుల బొమ్మలు కనిపిస్తాయి.

ప్రవృత్తి రేషా భూతానామ్ నివృత్తి స్తు మహాఫలామ్

కాబట్టి ఈ కామవాంఛ ఉండనే ఉంది.

**బాబ్** : స్త్రీ పురుషుల మధ్య ఉండే కామ సంబంధమా?

**శ్రీల ప్రభుపాదులు** : ఔను. స్త్రీ పురుషుల మధ్య ఉండే కామ సంబంధం. కాబట్టి మీరు ఐహిక ప్రపంచం నుంచి విముక్తి పొందాలనుకుంటే ఆ సంబంధం పూర్తిగా అంతరించి పోవాలి. లేకపోతే ఆ ఆసక్తి పెరుగుతూనే ఉంటుంది. మీరు పునర్జన్మ ఎత్తవలసి ఉంటుంది. మనిషిగానో, దేవతగానో, పశువుగానో, సర్పంగానో, పక్షిగానో, ఆడవిలో మృగంగానో పుట్టవలసి వస్తుంది. మళ్ళీ జన్మ ఎత్తాలి. కాబట్టి ఇలా ఆసక్తి పెరిగిపోతూ ఉండడం మన విధానం కాదు. అది సర్వ సాధారణ స్వభావం అయినప్పటికీ అది మనకు పనికి రాదు. అయితే ఎవరైనా దానిని బాగా తగ్గించుకోగలిగి నివారించుకోగలిగితే ఉత్తమంగా ఉంటుంది. కాబట్టి మన వేదపద్ధతి ఏమిటంటే, బాలుణ్ణి బ్రహ్మచారిగా పెంచడం. స్త్రీ కామంతో కూడిన జీవితం కూడదు. వేద సిద్ధాంతం కామాన్ని తగ్గించాలనే గాని దానిని పెంపొందింపజేయాలని కాదు. కాబట్టి మొత్తం ఈ వ్యవస్థను వర్ణాశ్రమధర్మం అంటారు. భారతీయ జీవిత వ్యవస్థ వర్ణాలనూ, ఆశ్రమాలనూ నిర్దేశిస్తుంది - నాలుగు సాంఘిక జీవన పద్ధతులు, మరి నాలుగు ఆధ్యాత్మిక పద్ధతులు, బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, సన్న్యాసి - ఇవి ఆధ్యాత్మిక విధానాలు. ఇక సాంఘిక విభాగా లేమిటంటే - బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు. కాబట్టి ఈ వ్యవస్థలో ఇంద్రియ నిగ్రహ విధానాలు ఎంత చక్కగా

ఉన్నాయంటే, ఎవరైనా భౌతిక జీవన సౌఖ్యాన్ని కోరుకున్నప్పటికీ చివరకు మోక్షం సంపాదించి, దేవదేవుణ్ణి చేరుకోగలిగేటట్లు వారిని అవి తీర్చిదిద్దుతాయి. అది ఒక క్రమం.కాబట్టి కామ జీవితం అనవసరం. కాని మనకు దానితో సంబంధం ఉంటుంది కనుక, దానిని సాగించడానికి కొన్ని నియమాలు, సిద్ధాంతాలు ఏర్పడ్డాయి. [అంతలో వెనకవైపున ఎక్కడో సంకీర్తన ప్రారంభమయింది. మృదంగ ధ్వనులు, నవ్వులు, కొమ్ముబూరాల ధ్వనులు వినవస్తాయి.]

**శ్రీల ప్రభుపాదులు** : శ్రీమద్భాగవతం(5.5.8) లో ఇలా ఉంది :

పుంసః స్త్రియా మిథునీ భావ మేతమ్
తయో ర్మిథో హృదయగ్రంథి మాహుః
అతో గృహ క్షేత్ర సుతాప్త విత్తైః
జనస్య మోహో ఽయ మహం మమేతి

స్త్రీ పురుషుల మధ్య అన్యోన్యప్రీతి, లైంగిక జీవితం భౌతిక జీవితానికి మూల సూత్రం. వారు కలసి కొన్నప్పుడు అంటే స్త్రీ పురుషులు కలసినప్పుడు వారి ఆ ప్రీతి పెంపొందుతుంది. ఆ వృద్ధి పొందిన ప్రేమ 'గృహ' (ఇల్లు), 'క్షేత్ర' (కొంత పొలం), 'సుత' (పుత్రులు), 'ఆప్త' (మిత్రుల సమాజం), 'విత్త' (ధనం) సంపాదించడానికి ప్రేరేపిస్తుంది. ఈ విధంగా అతడు 'గృహ క్షేత్ర సుతాప్త విత్తైః' - అనే వాటిలో చిక్కుకుంటాడు. 'జనస్య మోహో ఽయమ్' ఇది మాయ. ఈ మాయ వలన : 'అహం మమేతి' - "ఈ దేహం నేను, దానికి సంబంధించిన ప్రతిదీ నాది అని భావిస్తాడు."

**బాబ్** : మళ్ళీ అదేమిటి?

**శ్రీల ప్రభుపాదులు** : అంటే ఈ కామాసక్తి (సంగం) పెరుగుతుంది. ఈ భౌతిక ఆసక్తి : "నేను ఈ దేహమే. ఈ దేహం ఒక ప్రత్యేక ప్రదేశంలో ఉంది కాబట్టి - అదే నాదేశం'' అనే ఆలోచనలో చిక్కుకునేట్టు చేస్తుంది. ఇప్పుడదే జరుగుతూంది. "నేను అమెరికన్‌ను. నేనీ శరీరాన్ని, నేనా శరీరాన్ని. ఇది నా దేశం. నా దేశం కోసం, నా సంఘం కోసం ఎంతైనా త్యాగం చేస్తాను'' అని భావిస్తాడు. అలా మాయ పెరుగుతుంది. ఆ మాయాప్రభావం వల్ల మరణానంతరం మళ్ళీ జన్మిస్తాడు. ఆ జన్మ గొప్పది కావచ్చును. తక్కువది కావచ్చును. అది వాని 'కర్మ'ను బట్టి ఉంటుంది. గొప్ప జన్మ లభించినా, స్వర్గలోకాలకు వెళ్ళినా అదీ బంధమే. కాని, ఏ కుక్కగానో, పిల్లిగానో జన్మిస్తే జీవితం మరింత నాశనమవుతుంది. లేదా ఒక చెట్టు జన్మ - దానికి కూడా చాలా అవకాశాలున్నాయి. జీవుడు ఒక శరీరం నుంచి మరొక శరీరానికి ఎలా మారుతాడు, వివిధ దేహాలలో అతడు ఏ విధంగా చిక్కుకుంటాడు - అనే ఈ శాస్త్రం ప్రపంచానికి తెలియదు. కాబట్టి అర్జునుడు : "నేను శత్రు పక్షంలో ఉన్న నా అన్నదమ్ములను, తాతలను చంపితే...'' అని మాట్లాడుతున్నప్పుడు జీవితం అంటే శరీరమే అనే భావంతో ఉన్నాడు. అయితే అతని సమస్యలు తీరక పోయే సరికి, కృష్ణుణ్ణి శరణువేడి, అతనిని తన ఆధ్యాత్మిక గురువుగా స్వీకరించాడు. కృష్ణుడు అర్జునుణ్ణి మొదట ఈ విధంగా మందలించాడు :

అశోచ్యా నన్వశోచ స్త్వమ్ ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూ నగతాసూంశ్చ నానుశోచన్తి పండితాః

"నువ్వు పండితుడిలాగ మాట్లాడుతున్నావు. కాని నువ్వు మూఢాగ్రేసరుడవు. ఎందుచేతనంటే జీవితం అంటే దేహమనే భావంతో మాట్లాడుతున్నావు." (భ.గీ. 2.11) ఈ లైంగిక జీవితం దేహాత్మ భావనను ఎక్కువ చేస్తుంది. అందువల్లనే దానిని పూర్తిగ అంతరింప చేయడానికే ఈ వ్యవస్థ ఉద్దేశించబడింది.

**బాబ్** : కొన్ని దశలలో దానిని తగ్గించాలా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. అలాగే తగ్గించాలి. బాలుడు ఇరవై అయిదు సంవత్సరాలు వచ్చే వరకు లైంగిక జీవితాన్ని అదుపులో ఉంచి, విద్యార్థిగా క్రమశిక్షణ పొందాలి. అప్పు డతడు బ్రహ్మచారి. కొందరు బాలురు 'నైష్ఠిక బ్రహ్మచారులు' (అంటే జీవితాంతం బ్రహ్మచారులు)గాఉండి పోతారు.

ఎందుచేతనంటే వీరు విద్వాంసులై ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పూర్తిగా పొందుతారు గనుక. వారికి పెళ్ళి చేసుకోవాలనే కోరిక ఉండదు. వివాహం కూడా ఒక బంధనమే! వివాహం లేకుండా లైంగిక జీవితాన్ని గడప కూడదు. అందుకే మానవ సంఘంలో వివాహం అనేది ఉంది, పశు పక్ష్యాదులకు లేదు.

కాని, మానవులు క్రమేణ మానవత్వం నుంచి పశుత్వంలోకి దిగజారుతున్నారు; పెళ్ళి మాట మరచిపోతున్నారు. ఇది కూడా శాస్త్రాలలో చెప్పబడింది : "దాంపత్యే భిరుచి ర్హేతుః"- అని కలియుగంలో (ఈ కలహ యుగంలో) చివరకు పెళ్ళిళ్ళు ఉండవు. యువతీ యువకులు కేవలం కలసి జీవించడానికి ఇష్టపడుతారు. వారి సంబంధం మైథున సామర్థ్యం మీద ఆధారపడుతుంది. పురుషుడు గాని, స్త్రీ గాని మైథున సామర్థ్యం కోల్పోతే విడాకులు తీసుకుంటారు. ఈ విషయానికి సంబంధించినంత వరకు ఫ్రాయిడ్ మొదలైన చాల మంది పాశ్చాత్యతత్త్వవేత్తలు అనేక గ్రంథాలను రచించారు. అయితే వైదిక సంస్కృతిని బట్టి చూస్తే వివాహం కేవలం సంతానం కోసమే. అంతే కాని, లైంగిక మనస్తత్త్వాన్ని పరిశీలించడానికి కాదు. దానికి సంబంధించిన సహజ మనస్తత్వం ఇదివరకే ఉంది. ఏ విషయం తెలియక పోయినా ప్రతివానికీ లైంగిక విషయం సహజంగా తెలిసి ఉంటుంది. పాఠశాలల్లోగాని, కళాశాలల్లో గాని దానిని నేర్పనక్కర లేదు. అది అందరికీ తెలుసు. [నవ్వు.] అది సహజ స్వభావం. దానిని నిగ్రహించడానికి విద్య నేర్పాలి. అదే నిజమైన విద్య. [చాలా సేపు మౌనం. ఆ సమయంలో సైకిళ్ళ గంటలు, పిల్లలు ఆడుకుంటూన్న కేకలు, ఒకరినొకరు పిలుచుకొనే జనసమూహపు రొదలు వినిపిస్తాయి.]

**బాబ్** : ప్రస్తుతం అమెరికాలో దానిని గురించే కొత్త కొత్త భావాలు వెలువడుతున్నాయి.

**శ్రీల ప్రభుపాదులు** : అవును. అమెరికాలో సంస్కరింపవలసినవి చాలా ఉన్నాయి. ఈ కృష్ణచైతన్యోద్యమం ఆ పని చేస్తుంది. నేను మీ దేశానికి వెళ్ళినప్పుడు అక్కడ యువతీ యువకులు మిత్రులలాగ కలసి జీవించడం చూశాను. నా విద్యార్థులకు



నేను కూడా కర్మబంధం నుంచి విముక్తుణ్ణి కావలసి ఉంది కదా? అలా విముక్తం అయిన ఆత్మలు ఒకటిగా కలిసి పోతాయా? వేరు వేరుగా ఉంటాయా?

**శ్రీల ప్రభుపాదులు** : ప్రతివ్యక్తిలోని ఆత్మ ఒకేరీతిగా ఉంటుంది. ఆత్మలన్నిటికి కొన్ని సామాన్య లక్షణాలు ఉంటాయి. అయితే జీవితం గురించి ఇప్పుడు మీరు ఒక రకమైన భావంతో ఉన్నారు, ఈ మీ దేశస్థులు [అంటే అమెరికన్ శిష్యులు] మరొక రకమైన భావం కలిగి ఉన్నారు. కృష్ణ చైతన్యం ఎలా కలుగుతుందన్నది అంతిమశిక్షణ అవుతుంది. అదే సంపూర్ణత్వం.

**బాబ్** : కృష్ణ చైతన్యం ఉన్న ఇద్దరు వ్యక్తుల ఆత్మలు ఒకేలా ఉంటాయా?

**శ్రీల ప్రభుపాదులు** : ఆత్మలు ఎప్పుడూ ఒకలాగే ఉంటాయి.

**బాబ్** : అంటే ప్రతివ్యక్తిలోనూనా? ప్రతివ్యక్తిలోనూ అదే ఆత్మా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును.

**బాబ్** [ఇద్దరు శిష్యులను చూపిస్తూ] : వీరిద్దరూ కృష్ణ చైతన్యం కలవారైతే వీరి ఆత్మలు ఒకలాగే ఉంటాయా?

**శ్రీల ప్రభుపాదులు** : ఆత్మ ఒకటే! ఒకలాగానే ఉంటుంది. కాని ప్రతి వారి ఆత్మ విడివిడిగా ఉంటుంది. ఉదాహరణకు మీరు ఒక మనిషి; నేను ఒక మనిషిని. నేను మీలాగ క్రైస్తవుణ్ణి కాకపోయినా, మీరు నాలాగ హిందువు కాకపోయినా మనం మనుషులమే కదా! అదే విధంగా ఆత్మకు కృష్ణ చైతన్యం అబ్బినా అబ్బక పోయినా తేడా ఏమీ లేదు. ఆత్మ అంటే ఆత్మే.

**బాబ్** : దీనిని గురించి నాకింకా ఎక్కువ చెప్పగలరా?

**శ్రీల ప్రభుపాదులు** : ఆత్మ - కేవలం ఆత్మ. ఆత్మ లందరు సమానులు. పశువులలో కూడా. అందుచేతనే : "పండితాస్సమ దర్శినః"- అన్నారు. నిజమైన పండితులు మానవులలో గాని, పశువులలో గాని బాహ్య అచ్ఛాదనం (అంటే శరీరం) చూడరు. ఆత్మనే చూస్తారు.

**బాబ్** : దీని మీద నేను మరో ప్రశ్న అడుగ వచ్చా?

**శ్రీల ప్రభుపాదులు** : అడగండి.

**బాబ్** : ఆత్మను భగవంతునిలోని అంశగా భావిస్తున్నాను. కొన్ని సమయాలలో భగవంతుడు నా అనుభవంలోకి వచ్చిన ట్లనిపిస్తుంది. నేనిక్కడ ఉన్నాను గనుక దేవుడు ఇక్కడ ఉన్నా డని మీరు చెప్పవచ్చును. ఆత్మ నాలో ఉంటుంది గనుక భగవంతుడు నాలో ఉన్నట్లు భావించ వచ్చునా? అంటే పూర్తిగా భగవంతుడు కాదు...

**శ్రీల ప్రభుపాదులు** : భగవంతునిలో కొంత అంశ.

**బాబ్** : నాలో భగవంతుడున్నట్లు భావించడం లేదు. అయితే భగవంతుడు ఇక్కడ ఉండవచ్చును. విడిగా - నాకు విడిగా నా ఆత్మ భగవంతునిలో అంశ కనుక నాలో భగవంతు డున్నట్లు నేను భావించ గలుగుతానా?

**శ్రీల ప్రభుపాదులు** : తప్పకుండా! భగవంతుడు లోపల కూడా ఉన్నాడు, సర్వత్ర ఉన్నాడు. లోపలా బయటా కూడా ఉన్నాడు.

**బాబ్** : మీలో మీరు భగవంతుణ్ణి ఎలా అనుభవిస్తారు?

**శ్రీల ప్రభుపాదులు** : ప్రారంభంలో కాదు కాని, మీరు శాస్త్ర ప్రమాణాన్ని బట్టి వేద వాక్కుల ద్వారా తెలిసి కోవాలి. ఉదాహరణకు భగవద్గీత : ''ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఒర్జున! తిష్ఠతి'' - భగవంతుడు ప్రతివాని హృదయంలోనూ ఉన్నాడు. "పరమాణు చయాంతరస్థమ్"- భగవంతుడు ప్రతి అణువులోనూ ఉన్నాడు అని చెబుతూంది. ఇది మొట్టమొదట తెలుసుకోవాలి. తరువాత యోగాభ్యాసం వలన మీరు దానిని అనుభవానికి తెచ్చుకోవలసి ఉంది.

**బాబ్** : 'హరే కృష్ణ' సంకీర్తనం అలాంటి యోగాభ్యాసమా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. అది కూడా యోగాభ్యాసమే.

**బాబ్** : నేను ఈ జ్ఞానాన్ని అనుభవంలోకి తెచ్చుకోడానికి, లోపల ఉన్న ఆత్మను అనుభవించడానికి ఏ విధమైన యోగాభ్యాసం చేయాలి?

**శ్రీల ప్రభుపాదులు** : అనేక విధాలైన యోగాభ్యాసా లున్నాయి. కాని ఈ యుగంలో ఈ పద్ధతి చాలా మంచిది.

**బాబ్** :ఈ పద్ధతి అంటే సంకీర్తనమా?



**శ్రీల ప్రభుపాదులు** : అవును.

**బాబ్** : దీని ద్వారా భగవంతుణ్ణి నాలోనే గాక బయట కూడా అనుభవించగలనా?

**శ్రీల ప్రభుపాదులు** : దీని ద్వారా మీకు భగవంతుణ్ణి గురించి సర్వం తెలుస్తుంది - భగవంతుడు మీలో ఎలా ఉన్నాడో. బయట ఎలా ఉన్నాడో - ఎలా పని చేస్తున్నాడో అన్నీ తెలుస్తాయి. కేవలం మీ ప్రయత్నం వల్ల మీరు భగవంతుణ్ణి పొందలేరు. భగవంతుడే స్వయంగా తనను తాను సాక్షాత్కరింప చేసుకున్నప్పుడే పొందగలరు. ఉదాహరణకు : రాత్రి మీకు సూర్యుడు కనిపించనప్పుడు మీరు టార్చిలైటుతో గాని మరే దీపంతో గాని సూర్యుణ్ణి చూడలేరు. ప్రాతఃకాలంలోనైతేఎలాంటి దీపం లేకుండానే చూడగలుగుతారు. అదే విధంగా మిమ్మల్ని మీరు ఒక స్థితిలో పెట్టుకోగలగాలి. భగవత్సాక్షాత్కారం కాగల స్థితిలో మీరు ఉండాలి. అంటే ఏదో విధంగా : "దయ చేసి నాకు కనిపించు. నేను నిన్ను చూస్తాను'' అని భగవంతుణ్ణి అడుగగలమని అర్థం కాదు. భగవంతుడు మీరు చెప్పినట్లు వినడు.

**బాబ్** : తనను కనబరచుకోడానికి భగవంతుని అనుగ్రహాన్ని మనం సంపాదించాలి. అంతేనా?

**శ్రీల ప్రభుపాదులు** : అంతే!

**శ్యామ్‌సుందర దాస్** : మనం ఎప్పుడు భగవంతుణ్ణి సంతోషపెడుతున్నామో తెలుసుకోడం ఎలాగ?

**శ్రీల ప్రభుపాదులు** : మీరు అతనిని చూచినప్పుడు మీకే తెలుస్తుంది. ఉదాహరణకు : "మీరు భోజనం చేసినప్పుడు మీకు బలం వచ్చిందా? మీ ఆకలి తీరిందా?'' అని మీరు ఎవరినీ అడుగవలసిన అవసరం ఉండదు. మీరు ఆహారం తినగానే మీకు బలం కలుగుతున్నట్లు మీకు అర్థమవుతుంది. ఇంకెవరినీ అడుగనక్కరలేదు. అదే విధంగా మీరు నిజంగా భగవంతుణ్ణి సేవిస్తే : "భగవంతుడు నన్ను ఆజ్ఞాపిస్తున్నాడు. భగవంతుడు అక్కడ ఉన్నాడు. నేను భగవంతుణ్ణి చూస్తున్నాను'' అని గ్రహింప గలుగుతారు.

**ఒక శిష్యుడు** : లేకపోతే భగవంతుని ప్రతినిధిని చూస్తారు.

**శ్రీల ప్రభుపాదులు** : అది ఎక్కువ సులభంగా లభిస్తుంది. మీరు భగవంతుని ప్రతినిధి ద్వారా వెళ్ళాలి.

*యస్య ప్రసాదాత్ భగవత్ ప్రసాదః*

"ఆధ్యాత్మిక గురువు ప్రసాదం వలన భగవంతుని ప్రసాదం లభిస్తుంది." మీరు భగవత్ ప్రతినిధిని సంతోషపెడితే భగవంతుడు సంతోషిస్తాడు. ఆ విధంగా మీరు భగవంతుణ్ణి నేరుగా చూడగలుగుతారు.

**ఒక భారతీయ భక్తుడు** : భగవంతుని ప్రతినిధిని సంతోషపెట్టడం ఎలాగ?

**శ్రీల ప్రభుపాదులు** : ఆయన ఆజ్ఞలను పాలించాలి, అంతే! భగవంతుని ప్రతినిధి గురువు. "ఇది చేయి, అది చేయి" అని ఆయన ఆజ్ఞాపిస్తాడు, మీరు ఆ విధంగా చేస్తే సంతోషిస్తాడు.

*యస్యప్రసాదా న్న గతిః కుతో ఽపి*

"ఆధ్యాత్మిక గురువు అనుగ్రహం లేకపోతే ఏ విధమైన అభ్యుదయం పొందలేడు." మనం ఆయన మనసును కష్టపెడితే నాశనమై పోతాము. అందుకే మనం గురువును పూజిస్తాము.

*సాక్షాద్ధరిత్వేన సమస్త శాస్త్రై రుక్త స్తథా భావ్యత ఏవ సద్భిః*
*కింతు ప్రభో ర్యః ప్రియ ఏవ తస్య వందే గురోః శ్రీచరణారవిందమ్*

"ఆధ్యాత్మిక గురువు భగవంతునికి అత్యంత విశ్వాసపాత్రుడైన సేవకుడు గనుక, అతనిని సాక్షాత్తు దేవదేవునిగా పూజించాలి. ఇది సర్వమత గ్రంథాల చేత ఆమోదించ బడింది. కాబట్టి కృష్ణ భగవానుని నిజమైన ప్రతినిధి అయిన ఆధ్యాత్మిక గురువు పాదారవిందాలకు నేను వినయపూర్వకంగా ప్రణామాలు అర్పిస్తున్నాను." గురువును దేవునిగా భావించాలి. అది సర్వశాస్త్రములూ అంగీకరించిన శాసనం.



**బాబ్** : గురువును దేవాదిదేవుని ప్రతినిధిగా అంగీకరించాలా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. గురువు భగవంతుని ప్రతినిధి. గురువు శ్రీకృష్ణుని బాహ్య రూపం.

**బాబ్** : అయినా భూమిమీద శ్రీకృష్ణుడు ఎత్తిన అవతారాల కంటె భిన్నుడే కదా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును.

**బాబ్** : భూమి మీద కృష్ణుడు, లేదా శ్రీ చైతన్య మహాప్రభువు ఎత్తిన అవతారాలకూ గురువుకూ తేడా ఏమిటి?

**శ్రీల ప్రభుపాదులు** : గురువు కృష్ణుని ప్రతినిధి. గురువులో విశిష్టలక్షణాలుంటాయి. గురువు లక్షణాలను వేదాలు ఇలా వర్ణించాయి.

*తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛేత్*
*సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్*

గురువు అనే వాడు గురు శిష్య పరంపరలోని వాడై ఉండాలి. తన ఆధ్యాత్మిక గురువు నుంచి వేద సారస్వతాన్ని అధ్యయనం చేసిన వాడై ఉండాలి. సాధారణంగా సంపూర్ణభక్తి గురువు లక్షణం. అంతే! అప్పుడు అతడు కృష్ణుని సందేశాన్ని ప్రచారం చేయడం ద్వారా కృష్ణుణ్ణి సేవిస్తాడు.

**బాబ్** : చైతన్య మహాప్రభువు మీ కంటె వేరు రకం గురువా?

**శ్రీల ప్రభుపాదులు** : కాదు. గురువులలో రకాలు ఉండవు. అందరూ ఒకే విధంగా ఉంటారు.

**బాబ్** : కాని, ఆయన... ఆయన కృష్ణుని అవతారం కూడా గదా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. ఆయన స్వయంగా కృష్ణుడే! అయితే గురువులందరికీ ప్రతినిధి.

**బాబ్** : అలాగా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును.

**బాబ్** : మరి...

**శ్రీల ప్రభుపాదులు** : కృష్ణుడు దేవదేవుడు కాబట్టి :

సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ

"వివిధ ధర్మాలను వదలి నన్నే శరణు పొందు" అని శాసించాడు. కాని జనం దానిని సరిగా అర్థం చేసుకోలేదు. కాబట్టి కృష్ణుడు మళ్ళీ ఒక గురువుగా అవతరించి కృష్ణుని శరణు పొందడం అంటే ఏమిటో బోధించాడు.

**శ్యామసుందర దాస్** : భగవద్గీతలో కృష్ణుడు "నేను ఆధ్యాత్మిక గురువును" అని చెప్పుకోలేదా?

**శ్రీల ప్రభుపాదులు** : చెప్పుకున్నాడు. కృష్ణుడు ఆది గురువు. ఎందుచేత నంటే అర్జునుడు కృష్ణుణ్ణి ఆధ్యాత్మిక గురువుగా స్వీకరించాడు. ఇక ఆక్షేపణ ఏముంది?

శిష్యస్తే హం శాధి మాం త్వాం ప్రపన్నమ్

"నేను నీ శిష్యుణ్ణి. నిన్ను శరణు వేడిన జీవుణ్ణి. నన్ను శాసించు" అని అర్జునుడు దేవదేవునితో అన్నాడు. కృష్ణుడు ఆధ్యాత్మిక గురువు కాకపోతే అర్జునుడు ఆయనకు శిష్యు డెలా అవుతాడు? ఆయన ఆది గురువు. "తేనే బ్రహ్మ హృదాయ ఆదికవయే" - "సృజింపబడిన జీవులలో ప్రథముడైన బ్రహ్మ హృదయంలో మొట్ట మొదట వైదిక జ్ఞానాన్ని ఉపదేశించింది కృష్ణుడే." కాబట్టి అతడే ఆది గురువు.

**బాబ్** : కృష్ణుడా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. అతడే ఆది గురువు. అతని శిష్యుడు బ్రహ్మ. బ్రహ్మ శిష్యుడు నారదుడు. అతని శిష్యుడు వ్యాసుడు. ఈ విధంగా గురుపరంపర ఏర్పడింది. "ఏవం పరంపరా ప్రాప్త" - ఇంద్రియాతీత జ్ఞానం గురుశిష్య పరంపరగా లోకంలో గ్రహింపబడుతుంది.

**బాబ్** : కాబట్టి, గురువు తన జ్ఞానాన్ని గురుశిష్యపరంపర నుంచే గ్రహిస్తాడు. సాక్షాత్తు కృష్ణుని నుండి కాదా? మీరు సాక్షాత్ కృష్ణుని నుండి ఏమైనా జ్ఞానం పొందారా?



**శ్రీల ప్రభుపాదులు** : పొందాను. కృష్ణుని సాక్షాత్ సందేశమే భగవద్గీత.

**బాబ్** : అలాగా? కాని...

**శ్రీల ప్రభుపాదులు** : కాని, దానిని గురుపరంపర ద్వారా నేర్చుకోవాలి. లేక పోతే దానిని మీరు అపార్థం చేసుకోవచ్చును.

**బాబ్** : అయితే, ప్రస్తుతం మీకు జ్ఞానం కృష్ణుని నుండి సూటిగా లభించడం లేదు. గురుపరంపరా గత గ్రంథాల ద్వారా కలుగుతూంది అవునా?

**శ్రీల ప్రభుపాదులు** : భేదం ఏమీ లేదు. నేను ఇది పెన్సిలు అన్నా ననుకోండి. మీరు అతనితో : "అక్కడ పెన్సిలు ఉన్నది" అన్నా రనుకోండి. అతడు మరొకతనితో : "ఇది పెన్సిలు" అన్నాడనుకోండి. వారి మాటలకు నా మాటకు భేదం ఏమిటి?

**బాబ్** : ఇప్పుడు మీరు దీనిని గ్రహించడానికి కృష్ణుని అనుగ్రహం కారణమా?

**శ్రీల ప్రభుపాదులు** : కృష్ణుని దయను కూడా పొందవచ్చును. అయితే అది మీరు మేము ఇప్పుడు బోధిస్తున్న భగవద్గీతను గ్రహించినట్లే యథాతథంగా గ్రహించాలి. భగవద్గీత(18.66)లో కృష్ణుడు ఇలా అన్నాడు :

సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ

"వివిధ ధర్మాలను విడిచి నన్నే శరణు పొందు." మీరు సర్వాన్నీ పరిత్యజించి కృష్ణుణ్ణి శరణు పొందండని మేము ఇప్పుడు చెబుతున్నాము. కాబట్టి కృష్ణుని ఉపదేశానికీ మా ఉపదేశానికీ భేదం లేదు. దారి తప్పడము లేదు. కనుక ఇలాంటి నిర్దుష్ట పద్ధతిలో మీరు జ్ఞానాన్ని పొందితే సాక్షాత్ కృష్ణుని నుంచి ఉపదేశం పొందినట్లే! దానిని మేము ఏమీ మార్పు చేయము.

**బాబ్**: నేను భక్తిపూర్వకంగా, శ్రద్ధగా కృష్ణుణ్ణి ప్రార్థిస్తే ఆయన వినిపించుకుంటాడా?

**శ్రీల ప్రభుపాదులు** : తప్పకుండా! ఆయన మీ హృదయంలోనే ఉన్నాడు. మీ మాటలను ఎల్లప్పుడూ వింటూనే ఉన్నాడు. మీరు ప్రార్థించినా, ప్రార్థించక

పోయినా, మీరేమైనా పిచ్చి పనులు చేసినా వాటిని కూడా గమనిస్తాడు. మీరు ప్రార్థన చేస్తే చాలా మంచిదే - చెయ్యండి.

**బాబ్** : కృష్ణుని చెవికి పిచ్చి మాటల కంటె ప్రార్థన ఎక్కువ బిగ్గరగా వినిపిస్తుందా?

**శ్రీల ప్రభుపాదులు** : కాదు. ఆయన సర్వసంపూర్ణుడు. సమస్తాన్నీ వినగలడు. మీరు మాట్లాడక పోయినా. "ఇది చేద్దాము" అని మనస్సులో అనుకున్నా ఆయన వింటాడు. "సర్వస్య చాహం హృది సన్నివిష్టః" కృష్ణుడు ప్రతి జీవుని హృదయంలోను అధిష్ఠించి ఉన్నాడు.

**బాబ్** : కాని, ఎవరైనా సరే ప్రార్థన చేయాలి, అంతేనా?

**శ్రీల ప్రభుపాదులు** : ప్రార్థించడం వారి కర్తవ్యం.

**బాబ్** : ఎవరి కర్తవ్యం?

**శ్రీల ప్రభుపాదులు** : ప్రతి ప్రాణి యొక్క కర్తవ్యం. అదొక్కటే వారి కర్తవ్యం. "ఏకో బహూనాం యో విదధాతి కామాన్" అనే వేద వాక్యం.

**బాబ్** : దాని అర్థం ఏమిటి?

**శ్రీల ప్రభుపాదులు** : అతడు అందరికీ అన్నీ ఇస్తాడు. ప్రతీవారికీ ఆహారం ఇస్తున్నాడు. కాబట్టి అతడు తండ్రి. కనుక : "ఓ తండ్రీ! నాకిది ఇవ్వు" అని ఎందుకు ప్రార్థన చేయకూడదు? క్రైస్తవుల మత గ్రంథంలో : "ఓ తండ్రీ! మాకు మా రోజూ రొట్టె ఇవ్వు" అనే ప్రార్థన ఉంది. అది బాగుంది - వారు భగవంతుణ్ణి తమ పరమపితగా అంగీకరిస్తున్నారు. అయితే వయసు వచ్చిన వారు తండ్రిని ఇక అన్నం అడుగ కూడదు. ఆయనను సేవించడానికి సిద్ధంగా ఉండాలి. అదీ భక్తి.

**బాబ్** : నా ప్రశ్నలకు మీరే భలేగా సమాధానాలు చెబుతారు. [అందరూ నవ్వుతారు.]

**శ్రీల ప్రభుపాదులు** : ధన్యవాదాలు.

**బాబ్** : ఇప్పుడు మిమ్ములను మరొక ప్రశ్న అడుగనా?

**శ్రీల ప్రభుపాదులు** : ఓ! అడగండి, అడగండి.

# 4. ప్రకృతికి గల మూడు గుణాలు

## ఫిబ్రవరి 28, 1972

### (సంభాషణ తరువాయి భాగం)

**బాబ్** : మానవ జీవితంలో రజోగుణం, తమోగుణం, సత్త్వగుణం అని మూడు గుణాలు ఉన్నాయని విన్నాను. ఆ గుణత్రయం గురించి కొంచెం వివరించుమని కోరుతున్నాను. ముఖ్యంగా తమోగుణం అంటే ఏమిటి. సత్త్వ గుణం అంటే ఏమిటి?

**శ్రీల ప్రభుపాదులు** : సత్త్వ గుణంలో మీరు విషయాలను అర్థం చేసుకోగలుగుతారు - అంటే మీకు జ్ఞానం ఉంది అన్న మాట. భగవంతు డున్నా డనీ, ఈ జగత్తు ఆతనిచే సృష్టించబడిందనీ, ఇంకా అనేక విషయాలను, వాస్తవిక విషయాలను, సూర్యు డంటే ఇది, చంద్రు డంటే ఇది అనే విషయాలన్నీ గ్రహించ గలగడం సంపూర్ణ జ్ఞానం. ఆ జ్ఞానం సంపూర్ణం కాకపోయినా, కొంత ఉన్నా అది సత్త్వ గుణమే. ఇక రజో గుణంలో జీవుడు ఈ భౌతిక శరీరం తానే అని భావించి, ఇంద్రియ సంతృప్తికై ప్రయత్నిస్తాడు. అది రజో గుణం. ఇక తమో గుణం అంటే అజ్ఞానం. అంటే పశు జీవితం. అజ్ఞానంలో భగవంతుణ్ణి గురించి తెలియదు, సుఖపడడం ఎలాగో తెలియదు. మనం ఈ ప్రపంచంలో ఎందుకు ఉన్నామో తెలియదు. ఉదాహరణకు : మీరు ఒక పశువును కసాయివాడి వద్దకు తీసుకువెళ్ళారనుకోండి, అది మీ వెంట వస్తుంది. అది అజ్ఞానం. అదే మానవుడైతే ఎదిరిస్తాడు. కొంచెం సేపట్లో చంపబడబోతున్న మేక పిడికెడు గడ్డి పడవేస్తే అది సంతోషంగా మేస్తుంది శిశువు లాగే. శిశువు మీరు చంపడానికి ప్రయత్నిస్తున్నా సంతోషంగానే ఉంటుంది. నవ్వుతుంది. దానికి కారణం శిశువు అమాయికత, అజ్ఞానం! అదే తమో గుణం.

**బాబ్** : ఈ గుణాలే మన కర్మలను నిర్ణయిస్తాయి. అవునా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. ఈ ప్రకృతి గుణాల సంగమాన్ని బట్టి మన కర్మలు కలుషిత మవుతాయి.

కారణం గుణ సంగో ఽస్య సదసద్యోని జన్మసు

"ఎవరికైనా నీచజన్మగాని, ఉత్తమజన్మగాని ఈ ప్రకృతి గుణాల సమ్మేళనం బట్టి వస్తుంది." (భ.గీ.13.22)

**బాబ్** : అయితే, మోసగించడం మొదలైనవి ఏ గుణం క్రిందికి వస్తాయి?

**శ్రీల ప్రభుపాదులు** : మోసగించడం అనేది రజ స్తమో గుణ మిశ్రమం. ఒకడు ఇంకొకణ్ణి మోసగించా డనుకోండి. ఎందుకు? అతడు ఒక వస్తువును సంపాదించా లనుకుంటాడు. అంటే అతడు రజో గుణం కలవాడు. కాని, అతడు హత్య చేసినట్లయితే, దానికి ఫలితంగా అతడు దుఃఖం అనుభవించవలసి ఉంటుందని అతనికి తెలియదు. కాబట్టి అది రజ స్తమో గుణ మిశ్రమం.

**బాబ్** : అయితే ఒకడు వేరొకడికి సహాయం చేస్తే దానిని ఏమంటారు?

**శ్రీల ప్రభుపాదులు** : అది సత్త్వగుణం.

**బాబ్** : అది సత్త్వగుణం ఎందుకయింది? అది ఎలాంటి జ్ఞానం? అంటే ఏ జ్ఞానానికి అది చిహ్నం? జ్ఞానం కలిగి ఉండడం సత్త్వ గుణం అని మీరు అన్నారు గదా!

**శ్రీల ప్రభుపాదులు** : అవును.

**బాబ్** : కాబట్టి, పరోపకారం...

**శ్రీల ప్రభుపాదులు** : అంటే ఇతరుడు అజ్ఞాని అనీ, వాడికి మీరు జ్ఞానం కలుగజేయడానికి ప్రయత్నిస్తున్నా రనీ అర్థం.

**బాబ్** : కాబట్టి, జ్ఞానం కలిగించడం...

**శ్రీల ప్రభుపాదులు** : అవును. అది సత్త్వగుణం.



**బాబ్** : మరి కేవలం ఏదో సహాయం చేయడం మాట ఏమిటి?

**శ్రీల ప్రభుపాదులు** : అది కూడా సత్త్వ గుణమే.

**బాబ్** : ఏమీ లేని దరిద్రునికి బిచ్చం వెయ్యడం?

**శ్రీల ప్రభుపాదులు** : అదీ సత్త్వగుణమే కాని, న్యూయార్క్‌లో బౌవరీ వీధిలో కొంత మంది దానం చేస్తారు. ఆ ముష్టి వాళ్ళు వెంటనే ఒక సీసా ద్రాక్షమద్యాన్ని కొనుక్కొని తాగి, మత్తుగా పడిదొర్లుతారు. [అంతా నవ్వుతారు.] అది దాతృత్వమే. కాని సత్త్వ గుణం కాదు, అది తమో గుణం.

**బాబ్** : దాతృత్వం తమో గుణమా?

**శ్రీల ప్రభుపాదులు** : దాతృత్వం మూడు విధాలు : సాత్త్వికం, రాజసం, తామసం. సత్పాత్రదానమైనప్పుడు సాత్త్వికం అవుతుంది. అది ఈ కృష్ణ చైతన్యోద్యమానికి దానం ఇవ్వడం లాంటిది. ఎవరైనా ఈ ఉద్యమానికి దానం చేస్తే అది సాత్త్వికం. ఎందుచేత నంటే ఆ దానం భగవంతుని చైతన్యాన్నీ - కృష్ణ చైతన్యాన్నీ వ్యాపింపచేస్తుంది. అది సాత్త్వికం. ఏదో ప్రతిఫలాపేక్షతో ఎవరైనా దానం చేస్తే అది రాజసం. కాని ఎవరైనా దానాన్ని అయోగ్య స్థలంలో, అకాలంలో, దాని మీద గౌరవ భావం లేకుండా అపాత్రుడికి అంటే బౌవరీవీధిలో ముష్టివాడికి చేసినట్లు చేస్తే అది తామసం. కాని కృష్ణు డిలా అన్నాడు:

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్ తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణమ్

"నీవు దేనిని చేస్తావో, దేనిని తింటావో, దేనిని హోమం చేస్తావో, దేనిని ఇస్తావో (దానం చేస్తావో), ఏ తపస్సు చేస్తావో వాటిని నాకు కానుకగా అర్పించు." (భ.గీ.9.27) దానిని కృష్ణుడు తీసుకొంటే అది అత్యుత్తమ దానం, లేక కృష్ణుని ప్రతినిధి స్వీకరించినా అది ఉత్తమ దానమే!

**బాబ్** : ఆకలిగా ఉన్న వాడికి అన్నం పెట్టడం ఎటువంటి దానం అవుతుంది?

**శ్రీల ప్రభుపాదులు** : అది పరిస్థితులను బట్టి ఉంటుంది. ఉదాహరణకు వైద్యుడు ఒక వ్యాధిగ్రస్తుణ్ణి ఘన పదార్థాలు తినవద్దని నిషేధించాడనుకుందాం. కాని ఆ రోగి : "నాకు కొన్ని ఘనపదార్థాలు ఇవ్వండి" అని అడిగా డనుకోండి. అతనికి మీరు ఘన పదార్థాలను దానం ఇస్తే, మీరు అతనికి ఉపకారం చేసినట్లు కాదు. అది తామసిక దానం.

**బాబ్** : భక్తులు 'కర్మ' సంచయానికి అతీతులా? ఈ భక్తులు తాము 'కర్మ' చేస్తున్నట్లు భావిస్తారా? వారు ఈ మూడు గుణాలలోని పని చేస్తారా? లేక సత్త్వగుణంలోనే ఉంటారా?

**శ్రీల ప్రభుపాదులు** : భక్తులు సత్త్వగుణానికి అతీతులు. 'శుద్ధ సత్త్వులు' - వారు ఈ భౌతిక ప్రపంచంలో ఉండరు. వారు ఆధ్యాత్మిక ప్రపంచంలో ఉంటారు. ఈ మాట భగవద్గీతలో చెప్పబడింది :

మాం చ యో ఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణాన్ సమత్యేతాన్ బ్రహ్మభూయాయ కల్పతే

"అన్ని పరిస్థితులలోను నిశ్చలమై సంపూర్ణ భక్తియుక్త సేవలో నిమగ్నుడై ఉండేవాడు వెంటనే భౌతిక ప్రకృతి గుణాలను దాటి బ్రహ్మస్థితికి చేరుతాడు." (భ.గీ.14.26) కృష్ణ భక్తులు సత్త్వ రజ స్తమో గుణాలలో ఉండరు. వారు ఈ గుణాలకు అతీతులు.

**బాబ్** : ఎక్కువ శ్రద్ధ ఉన్న భక్తుడు ఆ స్థితికి చేరుతాడా?

**శ్రీల ప్రభుపాదులు** : ఔను. భక్తుడు... వారి లాగే మీరు కూడా భక్తులు కావచ్చును. అది కష్టం కాదు. కేవలం భగవంతుణ్ణి ధ్యానిస్తూ ఇష్టపూర్వకంగా ఆధ్యాత్మిక సేవలో మీ కాలాన్నిగడపాలి. అంతే!

**బాబ్** : భగవంతుణ్ణి గురించి ఇంకా ఎక్కువ తెలుసుకోవాలనుకుంటున్నాను, ఆయన సాన్నిధ్యాన్ని మరింతగా నా అనుభవంలోకి తెచ్చుకోవా లనుకుంటున్నాను. ఎందుచేత నంటే, అది లేకపోతే నా జీవితానికి సార్థకత లేదనిపిస్తుంది.



**శ్రీల ప్రభుపాదులు** : అవును. మీరు ఈ మానవ జన్మను వృధా చేసుకుంటే గొప్ప నష్టం సంభవిస్తుంది. అది ఐహిక బంధం నుంచి తప్పించుకోడానికి జీవుడికి దొరికిన మహా అవకాశం.

**బాబ్** : ఈ ప్రశ్నలు నేను వేయగలిగినందుకు నేను భగవంతునికి కృతజ్ఞుణ్ణి...

**శ్రీల ప్రభుపాదులు** : అవును. మీరింకా ఎక్కువగా తెలుసుకోవచ్చును.

**బాబ్** : కాని, నాకు ఇంకా ఇంటితో సంబంధా లున్నాయి... నాకు వివాహం నిశ్చయం అయింది.

**శ్రీల ప్రభుపాదులు** : వివాహమా? వివాహాలు చాలా జరుగుతూ ఉన్నాయి. [శ్యామసుందర దాస్‌ను చూచి] అతనికీ వివాహం అయింది. వివాహం అవరోధం కాదు. ఆధ్యాత్మిక జీవితంలో నాలుగు ఆశ్రమాలు ఉన్నా యని మీకు చెప్పాను. బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, సన్న్యాసి అని. కాబట్టి బ్రహ్మచర్యాశ్రమం తరువాత ఎవరైనా వివాహం చేసుకోవచ్చును. కాని బలవంతం లేదు. యావజ్జీవం నైష్ఠిక బ్రహ్మచారిగా ఉండిపోవచ్చును. వివాహ జీవితం తరువాత వానప్రస్థా శ్రమం ఉంది. అంటే, కుటుంబానికి కొంచెం దూరంగా ఉండాలి. భార్యా భర్తలు విడిగా జీవిస్తారు. ఆ సమయంలో లైంగిక జీవితం ఉండదు. తరువాత పూర్తి వైరాగ్యం కలిగినప్పుడు కుటుంబ జీవితాన్ని వదలి సన్న్యాసాన్ని స్వీకరిస్తారు.

**బాబ్** : అప్పుడు ఎవడైనా తన భార్యను మరిచి పోగలడా?

**శ్రీల ప్రభుపాదులు** : మరచిపోగలడు. ప్రయత్నిస్తే మరచిపోవడం కష్టం కాదు. కనుమరుగైతే మనసుకు మరుగైనట్లే. [అంతా నవ్వుతారు.] నాకూ భార్యా,బిడ్డలూ, మనుమలూ, మనుమరాండ్రూ అందరూ ఉన్నారు. కాని కనుమరుగైతే మనసుకు మరుగే. అంతే. కాబట్టి, వానప్రస్థం, సన్న్యాసం - వైదిక వ్యవస్థ అన్నిటినీ చాలా చక్కగా ఏర్పాటు చేసింది.

# 5. పరిశుద్ధుడు కావడం

## ఫిబ్రవరి 29, 1972

**బాబ్** : మీరు నన్ను ప్రశ్నలు అడుగనిస్తున్నందుకు ధన్యవాదాలు.
**శ్రీల ప్రభుపాదులు** : అది జీవిత కర్తవ్యం. ప్రజలు భగవచ్ఛాస్త్రాన్ని నేర్చుకోవాలి. దేవదేవునితో సహకరించక పోతే మన జీవితాలు నిరర్థకం అవుతాయి. ఒక యంత్రం నుంచి విడిపోయిన మరకు విలువ ఉండదనీ, ఆ మరను మళ్ళీ యంత్రానికి బిగించినప్పుడే దానికి విలువ వస్తుందనీ నేను చాలాసార్లు మీకు చెప్పాను. అదే విధంగా మనం భగవంతునిలో ఒక భాగం అయి ఉన్నాము. కాబట్టి భగవంతునితో కలసి లేకపోతే మన విలువ ఏమిటి? ఏమీ లేదు. భగవంతుని అంటుకొని ఉండడం అనేది మన స్థానం. మనం మళ్ళీ మన స్థానానికి చేరుకోవలసి ఉంది. అప్పుడు మనకు విలువ వస్తుంది.
**బాబ్** : ఈ వేళ మధ్యాహ్నం నేనొక వ్యక్తిని కలుసు కొన్నాను. అతడు మాయాపూర్‌లో హిప్పీలు ఉన్నారని విన్నాడట. అందుకని తాను ఇక్కడికి వచ్చాడట - మీకిది నవ్వులాటగా కనిపించవచ్చును.
**శ్రీల ప్రభుపాదులు** : ఏమిటి?
**బాబ్**: మాయాపూర్‌లో హిప్పీలు ఉన్నారని విన్నాడట. నేను అతనితో మాట్లాడాను. మీ శిష్యులు కూడా కొందరు అతనితో మాట్లాడారు. అతడు నాకు కొన్ని విషయాలు చెప్పాడు. నాకు అవి అర్థం కాలేదు. అతడు రేపు మళ్ళీ వస్తానన్నాడు, మీ శిష్యులతో మాట్లాడుతానన్నాడు. అతడు నాతో చెప్పిన మాట మీకు చెప్పనివ్వండి. అంతా గందరగోళంగా ఉంది. అతడు యువకుడుగా ఉన్నప్పుడు...
**శ్రీల ప్రభుపాదులు** : అతడు భారతీయుడా?
**బాబ్** : అవును. భారతీయుడే! దగ్గరలోనే నివసిస్తున్నాడు. ఇంగ్లీషు బాగానే



మాట్లాడుతాడు. అతడు యౌవనంలో ప్రతిదినం కాళికను శ్రద్ధా భక్తులతో పూజించాడు. ఒకసారి వరదలు వచ్చాయి. వరదలు రావడంతో ప్రజలకు భరించలేని కష్టాలు వచ్చాయి. ఇప్పుడు అతనికి ఏ మతం లేదు. మానవులలో పరస్పర ప్రేమాభివృద్ధికి ప్రయత్నించడంలో ఆనందం పొందుతున్నాడట. అతని జీవితంలో భగవంతుని పట్ల భక్తిని, మతం పట్ల గౌరవాన్నీ ప్రవేశపెట్టా లంటే అతనికి ఏం చెప్పాలో నాకు తోచలేదు. అతడు తాను మరణించిన తరువాత: "నేను భగవంతునిలో భాగం అవుతానో, కానో నాకు తెలియదు" అన్నాడు. అయితే ఆ విషయం గురించి అతని కిప్పుడు ఎలాంటి చింతా లేదు. తాను ఈ మతా నుభవాల కోసం ప్రయత్నించాడట. కాని అవేవీ లభించలేదుట. నేను ఇంతగా దీనిని గురించి అడగడానికి కారణం ఏమిటంటే నేను అమెరికాకు తిరిగి వెళ్ళినప్పుడు నేను చాలా మంది ఇలాంటి వాళ్ళనే కలుస్తాను. అతనికి కాళీ పూజ నిష్ఫలంగా తోచినట్లే చాలా మందికి తాము పాటిస్తున్న వివిధ మతాలు ఎందుకూ పనికి రాకపోయాయనే భావం ఏర్పడింది. అలాకాదు, మతాన్ని అనుసరించడమే మన కర్తవ్యం అని వారికి నచ్చచెప్పడానికి ఏం చేయాలో నాకు తోచడం లేదు.
**శ్రీల ప్రభుపాదులు** : ఇప్పుడప్పుడే అలా ప్రయత్నించకండి. మొదట మిమ్మల్ని మీరు సంస్కరించుకోండి.
**బాబ్** : సరే! అతనితో మీ శిష్యులను చూడమని చెప్పాను కదా! తరువాత రోడ్డు మీద దూరంగా వెళ్తూన్న అతనిని మళ్ళీ నేను కలుసుకున్నాను. "మళ్ళీ రండి" అన్నాను. అయితే...
**శ్రీల ప్రభుపాదులు** : మొదట మీ మట్టుకు మీరు క్షుణ్ణంగా తెలుసుకోండి. తరువాత ఇతరులకు నచ్చచెప్పడానికి ప్రయత్నించండి. శ్రీ చైతన్య మహా ప్రభువు ఆదేశం ఏమిటంటే - నీ జీవితం జయప్రదం అయినప్పుడే ఇతరుల జీవితాలను కూడా బాగు చేయగలవు అని :

భారత్ భూమితే హోయిలో మనుష్య జన్మ జార్
జన్మ సార్థక్ కరి ఒకర పరో పకార్

మొట్టమొదట నిన్ను నీవు సంపూర్ణునిగా చేసుకో. తరువాత ఇతరులకు ఉపదేశించడానికి ప్రయత్నించు.

**బాబ్** : అన్ని సమయాలలోనూ కృష్ణ చైతన్యం లేకపోతే అసలు సుఖ మనేదే ఉండదని మీ శిష్యులు అన్నారు. కాని, కొన్ని సమయాలలోనైనా నేను సుఖంగా ఉన్నట్లు అనుకుంటున్నాను.

**శ్రీల ప్రభుపాదులు** : కొన్ని సమయాలలోనేనా? అన్ని వేళలా కాదా?

**బాబ్** : అవును.

**శ్రీల ప్రభుపాదులు** : మీరు కృష్ణ చైతన్యసహితులైతే అన్ని సమయాలలోను ఆనందంగానే ఉంటారు.

**బాబ్** : "కృష్ణ చైతన్యం లేకపోతే అసలు మనకు సుఖమనేదే ఉండదు" - అనే భావాన్ని వారు వెలిబుచ్చారు.

**శ్రీల ప్రభుపాదులు** : అది నిజం. ఉదాహరణకి మీరు ఒక స్థల జంతు వనుకోండి. మిమ్మల్ని నీళ్ళలో పడవేస్తే, ఏ పరిస్థితిలోనూ మీకు సుఖం ఉండదు. మిమ్మల్ని మళ్ళీ భూమి మీదకు తీసుకు వస్తేనే మీకు సుఖం కలుగుతుంది. అదే విధంగా మనం భగవంతునిలో ఒక భాగం, కృష్ణునిలో భాగంగా ఉండకపోతే మనకు సుఖం కలుగదు. పూర్వం నేను చెప్పిన ఉదాహరణమే - యంత్రంలో ఒక భాగానికి యంత్రంలో ఉంటేనే విలువ. మళ్ళీ యంత్రంలో బిగించబడినప్పుడే దానికి విలువ వస్తుంది. మనం కృష్ణుని అంశలము, మనం కృష్ణుని చేరాలి. మీ చైతన్యం ద్వారా మీరు వెంటనే కృష్ణుణ్ణి చేరుకోవచ్చును. ఎలా? "నేను కృష్ణుని వాడను కృష్ణుడు నావాడు" అని నమ్మి ఆయనను కీర్తిస్తే చాలు. అంతే.

**బాబ్** : అదేమిటి? కృష్ణుడు...



**శ్రీల ప్రభుపాదులు** : కృష్ణుడు నా వాడు.

**బాబ్** : నా వాడా?

**శ్రీల ప్రభుపాదులు** : ఔను, నా వాడు నా కృష్ణుడు.

**బాబ్** : ఓహో!

**శ్రీల ప్రభుపాదులు** : కృష్ణుడు నా వాడు. కృష్ణుడు నా వాడు.

**బాబ్** : సరే.

**శ్రీల ప్రభుపాదులు** : నేను కృష్ణుని వాడను. అదీ మన నిజమైన స్థితి.

**బాబ్** : మనం కృష్ణుని లోని అంశలం.

**శ్రీల ప్రభుపాదులు** : అవును. సర్వము కృష్ణుని అంశే. కారణం - సర్వం కృష్ణుని శక్తి నుంచే పుట్టింది. సమస్తమూ కృష్ణ శక్తే.

**ఒక భారతీయ భక్తుడు** : శ్రీల ప్రభుపాదుల వారూ! నేనొక ప్రశ్న అడుగుతాను. భక్తిలేని సేవ ఎలాంటిది?

**శ్రీల ప్రభుపాదులు** : హు! అది సేవ కాదు - అది వ్యాపారం. [అందరూ నవ్వుతారు.] ఉదాహరణకు : ఇక్కడ మాయాపూర్‌లో ఒక కాంట్రాక్టరును నియమించాము. అది సేవ కాదు - వ్యాపారం. అంతే కదా? ఒక్కొకసారి వ్యాపారస్థులు : "మా బేరగాళ్ళే మా యజమానులు!" అని ప్రకటిస్తూ ఉంటారు కదూ? కాని "మా బేరగాళ్ళే మా యజమానులు" అని తియ్యని భాషలో చెప్పినప్పటికీ అది వాణిజ్యమే అవుతుంది. ఎందుకంటే డబ్బులు చెల్లించని వాడు బేరగాడు కాలేడు. 'సేవ' అంటే అలాంటి సేవ కాదు. శ్రీ చైతన్య మహాప్రభువు కృష్ణుణ్ణి ఇలా ప్రార్థించాడు:

యథా తథా వా విదధాతు లంపటో
మత్ప్రాణ నాథస్తు స ఏవ నాపర :

"నీవు నీ ఇష్టం వచ్చినట్టుచెయ్యి. ఏం చేసినా నీవు నా ప్రభుడవు. నీ నుంచి నేను

ఏ ప్రతిఫలాన్నీ నేను కోరను." అదీ సేవ అంటే. మీరు ప్రతిఫలం ఆపేక్షిస్తే అది వ్యాపారం అవుతుంది.

**బాబ్** : నేను భగవంతుని సమీపానికి చేరాను అనే భావం నాకు కలగాలంటే నేనేం చేయాలో మిమ్ములను అడగాలనుకుంటున్నాను. త్వరలోనే మిమ్ములను విడిచి వెళ్ళబోతున్నాను. మరి నేను...

**శ్రీల ప్రభుపాదులు** : మీరింకా పరిశుద్ధులు కావాలి.

**బాబ్** : కొన్ని సార్లు ఈ దేవాలయానికి వస్తున్నాను, వెళుతున్నాను. నా వెంట ఎంత తీసుకువెళుతున్నానో నాకు తెలియడం లేదు.

**శ్రీల ప్రభుపాదులు** : ఎంతో కాలం పట్టదు. ఆరు మాసాలలో మీలో అభివృద్ధిని గుర్తించగలరు. అయితే మీరు కొన్ని నియమాలను అనుసరించవలసి ఉంటుంది. అప్పుడు అంతా బాగుంటుంది - ఈ బాలురూ, బాలికలూ ఆచరిస్తున్నట్లే.

**బాబ్** : అవును. అర్థం అయింది.

**శ్రీల ప్రభుపాదులు** : సినిమాకు గాని, హోటలుకు గానీ వెళ్ళడం వీరికి ఇష్టం ఉండదు. వీరు సర్వ అనర్థాలనూ పరిహరించారు. అనవసరమైన వాటినన్నింటినీ దూరంగా తోసి వేశారు.

**బాబ్** : నేను మళ్ళీ మా దేశం వెళ్ళిపోయినప్పుడు వారు...

**శ్రీల ప్రభుపాదులు** : పరిశుద్ధతను సముపార్జించడమే మానవ జన్మ ప్రయోజనము.

**బాబ్** : అవును.

**శ్రీల ప్రభుపాదులు** : ఋషభ దేవుడు తన కుమారులకు ఇలా ఉపదేశించాడు:

> తపో దివ్యం పుత్రకా యేన సత్త్వమ్
> శుద్ధ్యేద్ యస్మాద్ బ్రహ్మసౌఖ్యం త్వనన్తమ్ (భాగ. 5.5.1)

'సత్త్వం' అంటే ఉనికి అని అర్థం, కాబట్టి మీ మనుగడను శుద్ధం చేసుకోకపోతే మీరు మీ దేహాన్ని మార్చవలసి ఉంటుంది, అంటే ఈ దేహం నుంచి మరో దేహానికి మారవలసి ఉంటుంది. ఒక్కొక్కప్పుడు అది ఇంత కంటె మంచి దేహం కావచ్చును. మరొకప్పుడు చెడు జన్మ కావచ్చును. ఉదాహరణకు, మీరొక వ్యాధిని నయం చేసుకోకపోతే అది మిమ్మల్ని అనేక విధాలుగా బాధించగలదు. అదే విధంగా మీరు మీ ఉనికిని పవిత్రంగా ఉంచుకోకపోతే ఈ దేహాన్ని వదలి మరొక దేహాన్ని పొందవలసి ఉంటుంది. ప్రకృతి నియమాలు చాలా సూక్ష్మాలు. మీకు రాబోయే జన్మ సుఖకర మైనదని గాని, మళ్లీ అమెరికాలోనే పుడతా రని గాని నిశ్చయం లేదు. కాబట్టి మానవుడు తన మనుగడను పరిశుద్ధం చేసుకోవాలి. అలా చేసుకోకపోతే, సుఖం కోసం పరుగులు పెట్టినా, అన్ని వేళలా సుఖపడరు.



**బాబ్** : నేను న్యూయార్క్‌లో ఉద్యోగంలో చేరాక పరిశుద్ధుడను అవుతానని ఆశిస్తున్నాను. కాని ఇక్కడ ఉన్న మీ శిష్యులంత పవిత్రుడను కాగలనని అనిపించడం లేదు.

**శ్రీల ప్రభుపాదులు** : వారు ఆచరిస్తున్నట్లు మీరూ ఆచరించగలరు. మొదట వారు కూడా అపవిత్రులే. ఇప్పుడు పవిత్రు లయారు. అదే విధంగా మీరూ పవిత్రులు కాగలరు. ఉదాహరణకు : మీ చిన్నతనంలో మీకు విద్య లేదు. కాని, ఇప్పుడు మీరు విద్యావంతులు.

**బాబ్** : అయితే నేను చేయవలసిన పను లేమిటి? అమెరికాకు తిరిగి వెళ్ళిన తరువాత నేను చేయవలసినది...

**శ్రీల ప్రభుపాదులు** : మీరెప్పుడు తిరిగి వెళుతారు?

**బాబ్** : ఇక్కడ నా ఉద్యోగం చేయడానికి మొదట చాయిబాసా వెళ్ళి...

**శ్రీల ప్రభుపాదులు** : చాయిబాసాలో ఏమి చెయ్యాలి?

**బాబ్** : నేను చదువు చెప్పవలసింది అక్కడే.

**శ్రీల ప్రభుపాదులు** : అలా అయితే మీరు ఈ చదువు చెప్పకుండా ఉండటం మంచిది. ఎందువల్ల నంటే, ఏం బోధించాలో మీకు తెలియదు.

**బాబ్** : [నవ్వుతాడు.] నేను వెళ్ళిపోవడానికే నిశ్చయించుకున్నాను. ఈ చదువు

చెప్పడం నాకు అట్టే ఇష్టం లేదు. నేను మే నెలలో అమెరికాకు తిరిగి వెళ్ళుతాను. కాని నేను ఇక్కడ ఉన్నంత కాలం, అంటే భారతదేశంలో ఉన్నంతకాలం, చదువు చెప్పాలని నా ఒప్పందం.

**శ్రీల ప్రభుపాదులు** : మీరు గట్టిగా తలచుకుంటే ఎక్కడ ఉన్నా పరిశుద్ధులుగా ఉండగలరు. అమెరికాలో ఉండడం, భారతదేశంలో ఉండడం అన్నది ప్రధానం కాదు. మిమ్మల్ని మీరు పరిశుద్ధులుగా ఉంచుకోవడం ఎలాగో తెలిసికోవాలి.

**బాబ్** : ఈ నియమాలను అనుసరించడం ద్వారా అనే కదా మీ అభిప్రాయం?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. ఉదాహరణకు - నేనూ అమెరికా వెళ్ళాను. కాని అమెరికాలో ఉన్నా, భారతదేశంలో ఉన్నా ఒకే విధంగా ఉన్నాను.

**బాబ్**: కాని, నేను [వారు 1971 నవంబరులో కొన్నాళ్ళు కలకత్తాలో ఉన్నప్పుడు] మిమ్ములను మొదట కలుసుకున్నప్పుడు మిమ్ములను అనుసరించడానికి ప్రయత్నించాను.

**శ్రీల ప్రభుపాదులు** : ఉహుఁ! అలాగే అనుసరించండి. నిజంగా మీరు పవిత్రులు కావాలంటే కచ్చితంగా నియమాలను అనుసరించి తీరాలి.

**బాబ్**: అదే నిజం కావచ్చును. నేను చెప్పేది మహా మూఢత్వం అనిపించవచ్చును. కాని, నేను ఏమి అనుకుంటున్నానో చెప్పనివ్వండి.

**శ్రీల ప్రభుపాదులు** : అది మూఢత్వం కాదు. దానిని మూఢత్వం అనను, అసంపూర్ణత అంటాను.

**బాబ్**: సరే! [నవ్వుతాడు.] అసంపూర్ణతే. నన్ను చెప్పనివ్వండి. ఇప్పటి నుంచీ నేను మీ శిష్యులను గౌరవిస్తున్నానని అనుకుంటున్నాను. అయితే వారిలో ఒకడుగా ఉండాలని కోరుకోడం లేదు. నాకు కావలసిందల్లా ఒక్కటే! మంచిపనేదో చేసి భగవంతునికి సన్నిహితుడనుకావడం మాత్రమే. నేను ఇంత కంటె మంచి జన్మ సంపాదిస్తే నాకు సంతృప్తి కలుగుతుంది.

**శ్రీల ప్రభుపాదులు** : మంచిది.



**బాబ్** : అది భౌతికాన్ని పట్టుకుని వ్రేలాడడంలా అనిపిస్తుంది గాని...

**శ్రీల ప్రభుపాదులు** : మీరు మా శిష్యుల అడుగుజాడలలో నడువండి- మీ కోరిక నెరవేరుతుంది. పవిత్రులై, సుఖంగాఉండడం ఎలాగో వాళ్ళకు మేము నేర్పుతున్నాము. అది మా జీవితాశయము. ప్రతివాడూ సుఖంగా ఉండాలని మా కోరిక. "సర్వే జనాః సుఖినో భవంతు." సుఖపడడం ఎలాగో జనానికి తెలియదు. సుఖపడడానికి ఉన్న రాజమార్గంలో వారు నడువరు. తమ సొంత మార్గాలను ఏర్పాటు చేసుకుంటారు. అదే వచ్చిన చిక్కు. అందుకే ఋషభ దేవుడు తన పుత్రులకు ఇలా ఉపదేశించాడు : "ప్రియమైన కుమారులారా! భౌతికాతీత అనుభూతి కోసం తపస్సు చేయండి." నిజానికి ప్రతివాడూ తపస్సు చేస్తూనే ఉన్నాడు. ఈ యువకుణ్ణి నేను ఎరుగుదును. వాణిజ్య నిర్వహణ శిక్షణ కోసం ఇతడు విదేశాలకు వెళ్ళవలసి ఉంది. కాని ఇప్పుడు ఇతడు బాగా స్థిరపడ్డాడు. ఈ విధంగా ప్రతివాడూ భవిష్యజ్జీవితం కోసం తపస్సు చేయవలసి ఉంది. అలాగే శాశ్వత సుఖంకోసం ఎందుకు తపస్సు చేయకూడదు? మీరు మీ ఉనికినీ, శరీరాన్నీ శుద్ధి చేసుకోవాలి. ఎన్ని సార్లు ఈ భౌతిక శరీరాన్ని పొందవలసి ఉంటుందో, అన్ని సార్లు శుద్ధి కోసం ప్రయత్నించి దానిని మార్చవలసి ఉంటుంది. కాని మీకు ఆధ్యాత్మిక శరీరం ప్రాప్తించగానే దేహాన్ని మార్చే ప్రసక్తి ఉండదు. మీకు ఇది వరకే ఆధ్యాత్మిక శరీరం ఉంది. మన భౌతిక మాలిన్యం వలన, ఈ భౌతిక శరీరాన్ని ఇప్పుడు పెంచుకుంటున్నాము. కాని, మనం ఆధ్యాత్మిక జీవితంలో ప్రవేశిస్తే ఆధ్యాత్మిక దేహాన్నే పెంచుకుంటాము. మీకు చాలాసార్లు ఒక ఉదాహరణం చెప్పి ఉన్నాను - ఒక ఇనుక కడ్డీని నిప్పులో ఉంచితే అది నిప్పులాగ అవుతుంది. అవునా?

**బాబ్** : అయితే ఇనుప కడ్డీని నిప్పులో పెట్టుమంటారా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. అప్పు డది నిప్పులా మారుతుంది.

**బాబ్** : అవును.

**శ్రీల ప్రభుపాదులు** : అది ఇనుము అయినప్పటికీ -
**బాబ్** : అవును.
**శ్రీల ప్రభుపాదులు** : అదే విధంగా మీరు ఎల్లప్పుడూ ఆధ్యాత్మిక జీవితం గడుపుతూ ఉంటే, మీ దేహం భౌతికమే అయినా ఆధ్యాత్మికంగా పని చేస్తుంది. ఇదివరకు చెప్పిన దృష్టాంతమే! ఇనుప కడ్డీ ఎర్రగా కాలినప్పుడు దానిని ఎక్కడ తాకినా కాలుస్తుంది. నిప్పు కున్న అన్ని గుణాలను అది పొందుతుంది. అదే విధంగా ఎప్పుడూ కృష్ణచైతన్యంలోనే ఉంటే మీరు ఆధ్యాత్మికతను పొందుతారు, ఆధ్యాత్మికంగా ప్రవర్తిస్తారు. అప్పుడు ఇక భౌతిక వాంఛలు ఉండవు.
**బాబ్** : అలా చేయడం ఎలాగ?
**శ్రీల ప్రభుపాదులు** : ఇదే పద్ధతి. వీరు ఆ విధంగా చేస్తున్నారు. మీరీ యువకులను చూశారు కదా? ఈ ఆరుగురూ ఈ రోజుననే దీక్షపొందారు. ఇది చాలా సులభం. నాలుగు నిషేధ నియమాలనూ పాటిస్తూ మీరు ఈ మాలతో జపించాలి. మాలతో జపించడం సులభం.
**బాబ్** : బాగానే ఉంది. కాని, చూడండి, మళ్ళీ నేను బీహారు వెళ్లి నా జీవన విధానాన్ని అనుసరిస్తున్నప్పుడు మీరు చెప్పిన అన్ని నియమాలను అనుసరిస్తాను - ఇప్పుడు కొన్ని అనుసరిస్తాను - అన్నీ కాదు -
**శ్రీల ప్రభుపాదులు** : "కొన్ని" అంటే...?
**బాబ్** : "కొన్ని"?
**శ్రీల ప్రభుపాదులు** : నియమాలు నాలుగే ఉన్నాయి, కొన్ని అంటే మూడా? రెండా?
**బాబ్** : రెండో మూడో.
**శ్రీల ప్రభుపాదులు** : మరి మిగిలిన వాటి మాటేమిటి?
**బాబ్** : కాదు. ఒకటో రెండో అని నా అభిప్రాయం. ఒకటో రెండో మాత్రమే నేను ఇప్పుడు అనుసరిస్తాను.



**శ్రీల ప్రభుపాదులు** [నవ్వుతూ] : తక్కిన వాటిని ఎందుకు అనుసరించరు? ఏమి కష్టం ఉంది? దేనిని మీరు అనుసరిస్తారు?
**బాబ్** : దేనిని నేను అనుసరిస్తా నంటారా? సరే! నేను ఇంచుమించు శాకాహారినే కాని, గుడ్లు తింటాను.
**శ్రీల ప్రభుపాదులు** :.అయితే అది కూడా సంపూర్ణం కాదు.
**బాబ్** : అవును - అది కూడా సంపూర్ణం కాదు. పోయిన సారి నుంచీ [అంటే నవంబరు నుంచీ] నేను శాకాహారిని అయ్యాను - కాని -
**శ్రీల ప్రభుపాదులు** : శాకాహారి అవడం ఒక గొప్ప యోగ్యత కాదు.
**బాబ్** : నిజమే! అంత పెద్ద యోగ్యత కాదు.
**శ్రీల ప్రభుపాదులు** : పావురాలు శాకాహారులు. కోతులూ శాకాహారులే! అన్నిటి కంటే అపరిశుభ్రంగా ఉండే ప్రాణులు...
**బాబ్** : అవును...
**శ్రీల ప్రభుపాదులు** : కోతి శాకాహారి. ఈ దిగంబర సన్న్యాసి అడవిలో నివసిస్తాడు... తగని కొంటె, తగని తుంటరి...
**బాబ్**: నాకు... శాఖాహారం తినడం కొంచెం సులభంగా అనిపించింది. ఎందుకంటే మొదట కొంచెం కష్టంగా తోచినా తరువాత సులభం అయింది. ఇప్పుడు నేను మళ్ళీ...
**శ్రీల ప్రభుపాదులు** : కాదు. మీరు కృష్ణచైతన్యాన్ని స్వీకరిస్తే నియమా లన్నింటికీ కట్టుబడి ఉండగలరు. లేకపోతే కుదురదు.
**బాబ్** : అవును నిజమే కాని, నేను... తిరిగి బీహారు వెళ్ళినప్పుడు నా మిత్రులు మరిజువానా పీలుద్దాం అనవచ్చును... ఒక సాయంకాలం ఒక చోట మేము దోమలను తోలుకుంటూ కూర్చుని ఉన్నాము. ఏ పనీ లేదు. అప్పుడు వారు : "మరిజువానా పొగ పీలిస్తే ఎలా ఉంటుంది?" అని అన్నారు. అప్పుడు నేను : "ఓ! తప్పక పీలుద్దాం. ఇంకొక పనేమీ లేదు కదా!" అన్నాను. తరువాత నేను వారితో

ఆ సాయంకాలం సులభంగా గడిపాను. ఒకసారి ఆ పని చేశాము. క్రమంగా దానికి లొంగిపోయాము. ఇక ప్రతిరోజూ అదే పని. అయితే దాని వలన చాలా హాని జరుగుతుం దని గ్రహించాక మాని వేశాము. కాని, అప్పుడప్పుడు మేము...

**శ్రీల ప్రభుపాదులు** : మీరు మాతో పాటు ఉండాలి. అప్పుడు మీ మిత్రులు "మరిజువానా సంగతి ఏమిటి?" అని అడగనే అడగరు. [బాబ్ నవ్వుతాడు.] మా శిష్యులతో సహవాసం చేయండి. మాతో సహవాసం చేసే అవకాశం ప్రజలకు కల్పించడానికై మేము వివిధ కేంద్రాలను తెరిచాము. మేము [మాయాపూర్‌లో] ఇంత స్థలం ఎందుకు కొన్నాము? ఎవరైనా తీవ్రంగా కోరుకుంటే వారు వచ్చి మాతో పాటు నివసిస్తారు. సహవాసానికి చాలా ప్రభావం ఉంటుంది. మీరు తాగుబోతుల సహవాసం చేస్తే తాగుబోతు లవుతారు, సాధువుల సహవాసం చేస్తే సాధువులు అవుతారు.

**శ్యామసుందర దాస్** : ఇతడు వచ్చి బొంబాయిలో మీతోపాటు ఉండి పోవచ్చును.

**శ్రీల ప్రభుపాదులు** : అవును. మీరు వచ్చి మాతో పాటు బొంబాయిలో ఉండవచ్చును. కాని, ఇతనికి మరిజువానా అలవాటు ఉన్న మిత్రులు కావాలి. అదే వచ్చిన ఇబ్బంది.

**బాబ్** : మరొక విషయం గురించి మిమ్ములను అడుగుతాను. తరువాత మళ్ళీ ఈ విషయంలోకి వస్తాను. నేను నా గురించే ఎక్కువగా ఆలోచిస్తున్నానని నాకు అనిపిస్తోంది. ఇలా అయితే నేను భగవంతుణ్ణి గురించి ఎక్కువగా ఆలోచించడం జరుగదు. నేను అనేక స్థలాలలో ఉన్నట్లు భావిస్తూ ఉంటాను. నా గురించి నేను మరచిపోయి, మిగిలిన ముఖ్యమైన విషయాలపైన నా మనస్సును లగ్నం చేయడం ఎలాగ?

**శ్రీల ప్రభుపాదులు** : వీరు [మా శిష్యులు] చేసినట్లు చేయడమే.

**బాబ్** : [నవ్వుతాడు.] అంటే మీరు చెబుతున్న మార్గం - పవిత్రతను సంపాదించే మార్గం - నేను భక్తుణ్ణి కావడమే అని మీరు అంటున్నా రన్నమాట -



**శ్రీల ప్రభుపాదులు** : ఇంకా సందేహిస్తున్నారా?

**బాబ్** : నేను...

**శ్రీల ప్రభుపాదులు** : భక్తులవడం ఏమంత కష్టమా?

**బాబ్** : నా మట్టుకు నాకు కష్టమే. దానికై నాకు పెద్ద కోరిక ఉన్నట్లు కూడా లేదు. మొదట శిష్యులు తాము భౌతిక జీవితాన్ని విడిచి పెట్టామని చెప్పారు. ఈ నాలుగు నియమాలనూ నాకు వివరించి చెప్పారు. దాని అర్థం భౌతిక జీవితాన్ని విడనాడడం అని నా కర్థమయింది. మరి దీనికి బదులుగా వారు...

**శ్రీల ప్రభుపాదులు** : భౌతిక జీవితం అంటే మీ అభిప్రాయం ఏమిటి? [బాబ్ మౌనంగా ఉండి పోయాడు.] నేను ఈ పరుపు మీద కూర్చున్నాను. ఇది భౌతికమా? ఆధ్యాత్మికమా?

**బాబ్** : భౌతికమే.

**శ్రీల ప్రభుపాదులు** : అలా అయితే మేము భౌతిక జీవితాన్ని ఏ విధంగా వదలినట్లు?

**బాబ్** : భౌతిక జీవితం అంటే "భౌతిక లాభాల పట్ల కోరి..." అని నాకు అనిపిస్తోంది.

**శ్రీల ప్రభుపాదులు** : భౌతికం అంటే ఏమిటి?

**బాబ్** : భౌతిక లాభాల కోసం పాటుపడడం, భౌతికమైన వాటిని విడువక పోవడం.

**శ్రీల ప్రభుపాదులు** : భౌతిక జీవితం అంటే - మీరు ఇంద్రియాలను సంతోషపెట్టాలని కోరుకోడం - దానిని భౌతిక జీవితం అంటారు. భగవంతునికి సేవ చేయాలని కోరిక ఉంటే దానిని ఆధ్యాత్మిక జీవితం అంటారు. అదీ భౌతిక, ఆధ్యాత్మిక జీవితాల మధ్య ఉన్న భేదం. ఇప్పుడు మనం ఇంద్రియాలను సేవించడానికి ప్రయత్నిస్తున్నాము. కాని ఇంద్రియ సేవకు బదులు భగవంతుణ్ణి సేవిస్తే అది ఆధ్యాత్మిక జీవితం అవుతుంది. మేము చేసే పనులకూ, ఇతరులు చేసే పనులకూ భేదం ఏమిటి? మేమూ అన్నిటినీ బల్ల, కుర్చీ, పరుపు, ధ్వని

ముద్రణ యంత్రం, టైప్‌రైటర్ - ఉపయోగిస్తాము. అయితే భేదం ఎక్కడ ఉంది? మేము ప్రతిదానినీ కృష్ణ సేవకే ఉపయోగిస్తున్నాము - అదే భేదం.

**బాబ్** : తాము విడిచి పెట్టిన భౌతిక సుఖాల స్థానంలో ఆధ్యాత్మిక సుఖాలను అనుభవిస్తున్నామని మీ శిష్యులు అంటున్నారు. కాని, అదే నాకు అనుభవంలోకి రావడం లేదు.

**శ్రీల ప్రభుపాదులు** : మీరు కృష్ణుణ్ణి సంతోషపెట్టదలచుకున్నప్పుడు ఆధ్యాత్మిక సుఖాలు అనుభవంలోకి వస్తాయి. అదే ఆధ్యాత్మిక సుఖం. ఉదాహరణకు: కుమారునికి అన్నం పెట్టడం తల్లికి చాలా సంతోషం. ఆమె తినడం లేదు. కాని, తన కుమారుడు సుఖంగా తినడం చూసి ఆమె సంతోషిస్తుంది.

**బాబ్** : ఆధ్యాత్మిక సుఖం అంటే భగవంతుని సంతోషపెట్టడం అన్నమాట.

**శ్రీల ప్రభుపాదులు** : ఆధ్యాత్మిక సుఖం కృష్ణుని ఆనందమే!

**బాబ్** : కృష్ణుణ్ణి సంతోషపెట్టడం.

**శ్రీల ప్రభుపాదులు** : భౌతిక సుఖం అంటే ఇంద్రియ సంబంధమైన సౌఖ్యం. అంతే. అదే భేదం. మీరు కేవలం కృష్ణుణ్ణి సంతోషపెట్టడానికి ప్రయత్నిస్తే అది ఆధ్యాత్మిక సుఖం.

**బాబ్** : నా దృష్టిలో భగవంతుణ్ణి సంతోషపెట్టడం అనే ఆలోచన...

**శ్రీల ప్రభుపాదులు** : భగవంతుణ్ణి సంతోషపెట్టడానికి మీ స్వంత మార్గాలను అన్వేషించకండి, నేను మిమ్మ సంతోషపెట్ట దలచా ననుకోండి. అప్పుడు : "మిమ్మలను ఏ విధంగా సేవించగలను?" అని మిమ్మల్ని నేను అడుగుతాను. అంతే కాదు, నేను ఏదో ఒక సేవ చేస్తే అది సంతోషపెట్టడం అనిపించుకోదు. నాకు ఒక గ్లాసెడు నీళ్ళు కావాలనుకోండి, "స్వాములకు పాలు - వేడి వేడి పాలు- ఇస్తే బాగా సంతోషిస్తారు" అని మీరు అనుకుంటే, అది నన్ను సంతోష పెట్టదు - మీరు నన్ను సంతోష పెట్టదలచుకుంటే : "ఏ విధంగా మిమ్మల్ని సంతోషపెట్టగలను?" అని మీరు నన్ను అడుగాలి. అప్పుడు నేను సూచించినట్లుగా మీరు ఆచరిస్తే అది నాకు సంతోషం కలిగిస్తుంది.



**బాబ్** : అయితే, కృష్ణుణ్ణి సంతోషపెట్టడం అంటే కృష్ణ భక్తు డవడం.

**శ్రీల ప్రభుపాదులు** : ఎప్పుడూ కృష్ణుణ్ణి సంతోషపెడుతూంటే వాడు కృష్ణ భక్తుడు. అతనికి వేరే పనిలేదు. అతడే భక్తుడు.

**బాబ్** : 'హరేకృష్ణ' నామసంకీర్తనం గురించి మరి కొంత చెప్పండి. నేను కొంత కాలం సంకీర్తన చేశాను. కాని ఎప్పుడూ నియతంగా చేయలేదు - అప్పుడొక కొంచెం, మరొకప్పుడొక కొంచెం చేశాను. ఇటీవలే జపమాలను సంపాదించాను. అప్పు డప్పుడు సంకీర్తనం నాకు సుఖంగా ఉన్నట్లు అనిపించేది. బహుశః నేను సంకీర్తన సరిగా చేయలేదేమో? నాకు తెలియదు.

**శ్రీల ప్రభుపాదులు** : అవును. ప్రతిదానికీ ఒక పద్ధతి ఉంది. ఆ పద్ధతిని మీరు అనుసరించాలి.

**బాబ్** : మీ శిష్యులు తాము సంకీర్తనం చేసేటప్పుడు ఆనందాతిరేకం పొందుతామని చెప్పారు.

**శ్రీల ప్రభుపాదులు** : అవును. మీరు పవిత్రులైన కొద్దీ మీకు కూడా ఆనందాతిరేకం ఎక్కువవుతుంది. ఈ సంకీర్తన పద్ధతే పవిత్రీకరణ పద్ధతి.

# 6. ఉత్తమ భక్తుడు

## ఫిబ్రవరి 29, 1972 సాయంకాలం

**శ్యామసుందర దాస్** : శ్రీల ప్రభుపాదుల వారూ! ఈ రోజు మధ్యాహ్నం మనం తపశ్చర్యను గురించీ, అనుష్ఠానం గురించీ చర్చించుకున్నాము.

**శ్రీల ప్రభుపాదులు** : ఔను.

**శ్యామసుందర దాస్** : మనం స్వచ్ఛందంగా అనుష్ఠానాన్నీ - తపశ్చర్యనీ ఆచరించక పోతే కొన్నిటిని నిర్బంధంగా ఆచరించవలసి వస్తుందా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. వాటిని ఆధ్యాత్మిక గురువు నిర్దేశించే మార్గంలో ఆచరించాలి... తపశ్చర్య మీద మీకు మనసు లేదు. కాని మీరొక ఆధ్యాత్మిక గురువును స్వీకరించినప్పుడు ఆయన ఆజ్ఞలను పాలించవలసి ఉంటుంది. అదే తపస్సు.

**శ్యామసుందర దాస్** : అంటే మనకు ఇష్టం లేకపోయినా తపస్సును ఆచరించాలి.

**శ్రీల ప్రభుపాదులు** : అవును. తప్పదు. ఎందుకంటే మీరు మీ ఆధ్యాత్మిక గురువుకు మిమ్మలను అంకితం చేసుకున్నారు. ఆయన ఆజ్ఞకు తిరుగులేదు. మీకు ఇష్టం లేకపోయినా మీరు దానిని ఆచరించవలసి ఉంటుంది. గురువు సంతోషం కోసమైనా!

**శ్యామసుందర దాస్** : ఓహో!

**శ్రీల ప్రభుపాదులు** : అయితే మీ కిష్టం లేదన్నమాట... [నవ్వుతారు.] అవును. ఉపవాసం ఎవరికీ ఇష్టం ఉండదు. కాని ఆధ్యాత్మిక గురువు "ఈ వేళ ఉపవాసం చెయ్యి" అని అంటే ఏమి చేయగలరు? [శ్యామ సుందర దాస్ నవ్వుతాడు.] తన ఆధ్యాత్మిక గురువు చెప్పుచేతలలో ఉండడానికి స్వయంగా అంగీకరించిన వానినే శిష్యుడు అంటారు. అదే తపస్సు.



**శ్యామసుందర దాస్** : మన తల్లిదండ్రులలాగ అన్నమాట! లేకపోతే ప్రపంచంలో చాలా మంది లాగ వారు భౌతిక ప్రపంచ వ్యామోహంలో పూర్తిగా పడిపోయి తపస్సు, శారీరక కష్టం అంటే ఇష్టపడరు. అయినా వారికి తప్పదు. ప్రకృతి వారి చేత బలవంతంగా తపస్సు చేయిస్తుంది.

**శ్రీల ప్రభుపాదులు** : అది బలవంతపు తపస్సు. అది మంచిది కాదు. స్వచ్ఛంద తపస్సు మాత్రమే పనికి వస్తుంది.

**శ్యామసుందర దాస్** : మీరు స్వచ్ఛందంగా తపస్సు చేయకపోతే బలవంతంగా తపస్సు చేయవలసి వస్తుంది.

**శ్రీల ప్రభుపాదులు** : అదే మనుష్యులకు, పశువులకు గల తేడా. పశువు తపస్సును అంగీకరించలేదు. కాని, మానవుడు స్వీకరించగలడు. మిఠాయి దుకాణంలో మంచి తినుబండారం ఉంది. ఒకడికి అది కావాలి. కాని తన దగ్గర డబ్బులేదని తనకు తెలుసు కాబట్టి తనను తాను నిగ్రహించుకో గలడు. కాని ఒక ఆవు అలా వస్తుంది, దానికి తినాలనిపిస్తే వెంటనే దాని మూతిని లోపల పెడుతుంది. దానిని మీరు కర్రతో కొట్టవచ్చును. అది సహిస్తుంది. దానికి అంతే తెలుసు. పశువులు తపస్సు చేయలేవు. మన తపస్సు చక్కగా సులభంగా ఉంది. మనం 'హరే కృష్ణ' సంకీర్తన, నృత్యం చేస్తాము. శ్రీకృష్ణుడు మనకు మంచి ఆహారాన్ని పంపిస్తాడు. మనం దానిని భుజిస్తాము. అంతే! మీరు అలాంటి తపస్సును ఎందుకు అంగీకరించరు? చక్కగా సంకీర్తనం చేయడం, ఆడడం, పాడడం, తినడం.

**బాబ్** : అదేమిటి?

**శ్రీల ప్రభుపాదులు** : మనం తపస్సు చేస్తున్నాం. కాబట్టి కృష్ణుడు మనకు మంచి వస్తువులను ఇస్తాడు. కనుక మనకు నష్టం లేదు. కృష్ణ భక్తులైతే మీకు మరిన్ని సౌకర్యాలు కలుగుతాయి. ఇది యథార్థం. నేను గడచిన ఇరవై సంవత్సరాలుగా ఒక్కణ్ణే జీవిస్తున్నాను. కాని నాకు కష్టాలేవీ రాలేదు. సన్యసించక ముందు నేను

ఢిల్లీలో ఉండేవాణ్ణి. అప్పుడు ఆ విధంగా ఏ కష్టం లేకుండా ఉండేవాణ్ణి. ఒంటరిగా ఉన్నా కూడా కష్టా లేవీ ఉండవు.

**శ్యామసుందర దాస్** : మీరు ఆధ్యాత్మిక క్రమశిక్షణను అంగీకరించకపోతే ప్రకృతి మీకు ఎన్నో ఆపదలను తెచ్చి పెడుతుంది.

**శ్రీల ప్రభుపాదులు** : ఔను. ఆ విషయం భగవద్గీతలో చెప్పబడింది:

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే

"భౌతిక ప్రకృతికి సంబంధించిన మూడు గుణాలతో కూడిన నా శక్తి దాటడానికి శక్యంకానిది. కాని, నన్ను శరణు పొందిన వారు దానిని సులభంగా దాటగలరు." **(భ.గీ.7.14)** మాయ మనకు ఎన్నో ఆపదలను కలిగిస్తుంది. కాని కృష్ణుణ్ణి శరణు పొందిన వెంటనే ఇంక కష్టాలు ఉండవు. మనకు ఇక ఆపదలు ఉండవు.

**శ్యామసుందర దాస్** : "భవిష్యత్తులో సుఖంగా ఉండగలము" అని ఎల్లప్పుడూ భావించేటంత మూఢులము మనము.

**శ్రీల ప్రభుపాదులు** : అవును. అదే 'మాయ'. అది గాడిద లాంటిది. మీరు గాడిద వీపుపై కూర్చుని చేతితో కొంచెం గడ్డి పట్టుకోండి. గాడిద "ఇంక కొంచెం దూరం పోతే నాకా గడ్డి దొరుకుతుంది" అని అనుకుంటుంది. [బాబ్ నవ్వుతాడు.] ఆ గడ్డి ఎంతదూరం పోయినా ఒక అడుగు దూరంలో ఉంటుంది. అదే గాడిదతనం అంటే. [అందరూ నవ్వుతారు.] ప్రతివాడూ : "ఇంక కొంచము ముందుకు పోతే నాకు అది దొరుకుతుంది, అప్పుడు సుఖంగా ఉంటాను" అని అనుకుంటాడు.

**బాబ్** : మీకు చాలా కృతజ్ఞుణ్ణి...

**శ్రీల ప్రభుపాదులు** : ఊఁ?

**బాబ్** : రేపు నేను మిమ్మల్ని విడచి వెడుతున్నాను...

**శ్రీల ప్రభుపాదులు** : మీరు 'లీవ్' (విడిచి వెడుతున్నాను అని) అని అనకండి, 'లివ్' (కలసి జీవిద్దాము అని) అనండి.



**బాబ్** : నేను ఇప్పుడే ఆ పని చేయలేను. నేను రేపు మా ఊరికి తిరిగి వెళ్ళడం గురించి ఆలోచిస్తున్నాను. అయితే...

**శ్రీల ప్రభుపాదులు** : తిరిగి వెళ్ళడం కాదు.

**బాబ్** : రేపు నేను ఇక్కడే ఉండాలంటారా?

**శ్రీల ప్రభుపాదులు** : ఔను. ఇక్కడే ఉండిపొండి.

**బాబ్** : మీరు చెబుతున్నారు కాబట్టి ఉంటాను.

**శ్రీల ప్రభుపాదులు** : మంచిది. మీరు చాలా మంచి వారు. [చాలా సేపు మౌనం. చాలా ప్రశాంతంగా గడుస్తుంది.] అది చాలా తేలిక. జీవులు కృష్ణుణ్ణి మరచిపోయినప్పుడు భౌతిక ప్రపంచంలో ఉంటారు. కృష్ణుడు అంటే అతని పేరు, అతని రూపం, అతని నివాస స్థానం, అతని లీలలు - అన్నీను.

**బాబ్** : ఆ చివరి మాట ఏమిటి?

**శ్రీల ప్రభుపాదులు** : అతని లీలలు. మనం ఒక రాజును గురించి మాట్లాడుతున్నప్పుడు అతని ప్రభుత్వం, అతని ప్రాసాదం, అతని రాణి, అతని పుత్రులు, మంత్రులు, సైన్యబలం, అన్నిటిని గురించీ అని అర్థం - అవునా?

**బాబ్** : అవును.

**శ్రీల ప్రభుపాదులు** : అదే విధంగా కృష్ణుణ్ణి గురించి మనము తలచుకున్నప్పుడు కృష్ణుడు దేవదేవుడు గనుక ఆయన సర్వశక్తులను స్మరిస్తున్నామని అర్థం. "రాధాకృష్ణ" అనే మాటలో ఈ అర్థం అంతా ఉంది. 'రాధ' అంటే కృష్ణుని సర్వశక్తులూ అని అర్థం. ఇక కృష్ణుడు దేవదేవుడే కదా! కాబట్టి మనం కృష్ణుణ్ణి గురించి మాట్లాడేటప్పుడు జీవులు కూడా చేరుతారు. జీవులు అంటే కృష్ణుని శక్తులు కదా. కాబట్టి ఈ శక్తి శక్తిమంతుణ్ణి సేవించనప్పుడు అది భౌతిక జీవితం అవుతుంది. ప్రపంచమంతా కృష్ణుణ్ణి సేవించదు. కొందరు కృష్ణుణ్ణి వేరు విధంగా సేవిస్తూ ఉంటారు. అవిధేయులైన పౌరులు కూడా ప్రభుత్వాన్ని పరోక్షంగా సేవించినట్లు, వారు కృష్ణుణ్ణి పరోక్షంగా సేవిస్తూ ఉంటారు. రాజ్య

శాసనాన్ని అతిక్రమిస్తే ప్రజలు కారాగృహంలో పడుతారు. వారు కారాగారంలో బలవంతంగా రాజ శాసనాలకు లోబడవలసి వస్తుంది. అలాగే ఇక్కడ జీవులందరూ అజ్ఞానం వల్ల గాని, స్వంత నిర్ణయం వల్ల గాని నాస్తికులు అవుతున్నారు. వారు దేవదేవుని ప్రభుత్వాన్ని అంగీకరించరు, వారు ఆసురప్రవృత్తి కలవారు. కాబట్టి మేము వారిని వారి అసలు స్థితికి తీసుకు రావడానికి ప్రయత్నిస్తున్నాము. అదే కృష్ణ చైతన్యోద్యమం.

**బాబ్** : నేను మీ శిష్యులతో మాట్లాడిన ఒక విషయాన్ని గురించి - వైద్యం గురించి- మిమ్ములను అడుగాలనుకుంటున్నాను. ఈ వేళ నేను కొంత మంది శిష్యులతో కలసి నదికి కాలి నడకను వెళ్ళాను. నాకు జలుబు చేసింది కాబట్టి నేను నీళ్ళలో దిగకూడదు అని నేను అన్నాను. కాని, అది గంగ కాబట్టి దిగినా ఫర్వాలేదని కొందరు, నాకు జలుబుగాఉంది గనుక నీళ్ళలో దిగకూడ దని కొందరు అన్నారు. మేము దానిని గురించి మాట్లాడుకున్నాము. నాకు అర్థం కాలేదు. మన పూర్వజన్మ కర్మలను బట్టి మనకు జలుబు చేస్తుందా?

**శ్రీల ప్రభుపాదులు** : ఔను. అది నిజం, మనం అనుభవించే ప్రతి దుఃఖానికీ పూర్వ జన్మలలోని చెడు పనులే కారణం.

**బాబ్** : కాని కర్మప్రభావం నుంచి విముక్తి పొందినా కూడా అనారోగ్యం కలుగుతుందా?

**శ్రీల ప్రభుపాదులు** : కలుగదు. ఒకవేళ కలిగినా అది చాలా తాత్కాలికం. ఉదాహరణకు: ఈ పంఖా తిరుగుతూంది. మీరు విద్యుత్ ప్రసారాన్ని ఆపివేసినా అది కొంతసేపు తిరుగుతూనే ఉంటుంది. ఆ తిరుగుడు విద్యుత్ ప్రసారం వలన కాదు. అది దాని వేగం వలన . . . భౌతికంగా ఈ వేగాన్ని ఏమంటారు?

**శ్యామసుందర దాస్** : ప్రచోదనం (మూమెంటమ్) [అంటే ప్రారబ్ధ వేగం అంటారు].

**శ్రీల ప్రభుపాదులు** : ప్రచోదనం. కాని అది ఆగిపోయిన వెంటనే ఇక తిరుగదు.



అదే విధంగా, కృష్ణునికి ఆత్మార్పణం చేసికొన్న భక్తుడు ఏదైనా భౌతిక ఫలం వల్ల బాధపడుతూ ఉన్నా, అది తాత్కాలికం. కాబట్టి భక్తునికి భౌతిక దుఃఖాలు దుఃఖాలు కావు. అతనికి అవి కృష్ణ భగవానుని అనుగ్రహాలుగా కనబడుతాయి.

**బాబ్** : పరిపూర్ణ జీవుడు, ఒక భక్తుడు, ఒక పరిశుద్ధ భక్తుడు...

**శ్రీల ప్రభుపాదులు** : పరిపూర్ణ జీవుడు అంటే దినానికి ఉన్న ఇరువైనాలుగు గంటలూ కృష్ణ చైతన్యంలో గడిపేవాడు. అది పరిపూర్ణత్వం. అది ఒక భౌతికాతీత దశ. పరిపూర్ణత్వం అంటే తన అసలైన చైతన్యంలో నిమగ్నుడై ఉండడం. ఇదే పరిపూర్ణత్వం అని భగవద్గీతలో చెప్పబడింది:

స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః

"స్వీయ కర్మలను అనుసరిస్తూ ప్రతీవ్యక్తీ సంపూర్ణత్వం పొందుతాడు." సంపూర్ణత్వం అంటే 'సంసిద్ధి'. 'సిద్ధి' అంటే పరిపూర్ణత్వం. అది బ్రహ్మ జ్ఞానమూ, ఆత్మ జ్ఞానమూను. 'సంసిద్ధి' అంటే భక్తి. అది బ్రహ్మ జ్ఞానం తరువాత వస్తుంది.

**బాబ్** : దయచేసి ఆ చివరిమాట మరొకసారి చెబుతారా?

**శ్రీల ప్రభుపాదులు** : 'సంసిద్ధి'- 'సం' అంటే పరిపూర్ణమని అర్థం. 'సిద్ధి' అంటే ఉత్కృష్టత. భగవద్గీతలో ఇలా చెప్పబడింది. ఇంటికి చేరినవాడు - తిరిగి భగవంతుణ్ణి చేరినవాడు అంటే పరిపూర్ణత్వాన్ని పొందినవాడు అని. కాబట్టి తానీ దేహం కాదనీ, తాను ఆత్మఅనీ తెలిసి కొన్నప్పుడు పూర్ణత్వం లభిస్తుంది. 'బ్రహ్మభూతః' అంటే బ్రహ్మను తెలిసి కొన్నవాడు. అది పూర్ణత్వం. 'సంసిద్ధి' బ్రహ్మ జ్ఞానానంతరం వస్తుంది, భక్తియుత సేవలో నిమగ్నుడై ఉన్నప్పుడు వస్తుంది. కాబట్టి ఇంతకు ముందే భక్తియుత సేవలో ఉన్న వాడైతే అతనికి బ్రహ్మజ్ఞానం ఉందని అర్థం చేసికోవాలి. దానిని 'సంసిద్ధి' అంటారు.

**బాబ్** : మీకు అనారోగ్యం గాని, వ్యాధి గాని కలగడం ఉందా?... క్షమించండి మిమ్మల్ని సవినయంగా ఈ ప్రశ్నను అడుగుతున్నాను.

**శ్రీల ప్రభుపాదులు** : ఆఁ ఉంది.

**బాబ్** : అయితే ఇది మీ పూర్వజన్మ కర్మఫలమా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును.

**బాబ్** : కాబట్టి ఈ భౌతిక ప్రపంచంలో ఎవరూ తమ కర్మఫలాన్ని పూర్తిగా తప్పించుకోలేరు కదా?

**శ్రీల ప్రభుపాదులు** : కాదు. తప్పించుకోగలడు. భక్తుడికి కర్మ ఉండదు. కర్మ ఫలమూ ఉండదు.

**బాబ్** : కాని, మీరు అత్యుత్తమ భక్తులు కదా!

**శ్రీల ప్రభుపాదులు** : ఉహుఁ! కాదు. నేను అలా అనుకోడం లేదు. నేను అత్యధముడను.

**బాబ్** : కాదు!

**శ్రీల ప్రభుపాదులు** : మీరు అత్యుత్తమ భక్తులు.

**బాబ్** : [నవ్వుతాడు.] కాదు. కానేకాదు. అయితే చూడండి... మీరు చెప్పినది ఎప్పుడూ సరిగ్గా ఉన్నట్లే అనిపిస్తుంది.

**శ్రీల ప్రభుపాదులు** : అవును.

**బాబ్** : అలా అయితే మీరు అత్యుత్తమ భక్తులు అయి ఉండాలి.

**శ్రీల ప్రభుపాదులు** : నిజం చెప్పాలంటే ఉత్తమ భక్తుడు కూడా ప్రచారం చేసేటప్పుడు మధ్యమ స్థాయి భక్తుని దశకు దిగివస్తాడు.

**బాబ్** : అత్యుత్తమ భక్తుడు ఏం చేస్తుంటాడు?

**శ్రీల ప్రభుపాదులు** : అత్యుత్తమ భక్తుడు ప్రచారం చేయడు.

**బాబ్** : మరి అత డేమి చేస్తాడు?

**శ్రీల ప్రభుపాదులు** : ప్రచారం అనవసర మని గ్రహిస్తాడు. అతని దృష్టిలో ప్రతివాడూ భక్తుడే. [బాబ్ హృదయపూర్వకంగా నవ్వుతాడు.] అవును. అతనికి భక్తులు కానివారు కనిపించరు - అందరూ భక్తులే. అతనిని 'ఉత్తమాధికారి' అంటారు. నేను ఇంకా ప్రచారం చేస్తూనే ఉన్నప్పుడు నేను అత్యుత్తమ భక్తుడనని ఎలా చెప్పుకోగలను? సరిగా రాధారాణి లాగే భావించాలి - ఆమె దృష్టిలో భక్తుడు కాని వాడు లేడు. కాబట్టి మేము రాధారాణిని సమీపించడానికి ప్రయత్నిస్తాము.



**బాబ్** : ఆమె ఎవరు?

**శ్రీల ప్రభుపాదులు** : ఆమె శ్రీకృష్ణుని ప్రియురాలు. శ్రీమతి రాధారాణి.

**బాబ్** : ఓహో!

**శ్రీల ప్రభుపాదులు** : రాధారాణిని ఎవరైనా సమీపిస్తే అతడు మంచివా డని ఆమె కృష్ణునితో చెబుతుంది : "ఇదిగో ! ఇతడు ఉత్తమ భక్తుడు. ఇతడు నాకంటె మెరుగైన వాడు" అని. అతనిని కృష్ణుడు నిరాకరించడు. అతడే అత్యుత్తమ భక్తుడు. కాని "నేను అత్యుత్తమ భక్తుణ్ణి అయ్యాను" అని ఎవరినీ అనుకరించరాదు.

ఈశ్వరే తదధీనేషు బాలిశేషు ద్విషత్సు చ
ప్రేమ మైత్రీ కృపోపేక్షా యః కరోతి స మధ్యమః (భాగ. 11.2.46)

మధ్యమ భక్తుని దృష్టికి కొందరు భగవంతునియెడ అసూయగలవారుగా కనబడుతారు. కాని ఉత్తమ భక్తుని దృష్టి అలాంటిది కాదు. ఉత్తమ భక్తుని దృష్టిలో : "దేవదేవుని పట్ల అసూయ గల వారెరూ లేరు. ప్రతివాడూ తనకంటె అధికుడే." 'చైతన్య చరితామృత' కర్త కృష్ణదాస కవిరాజు ఇలాగ వ్రాసుకున్నాడు: "నేను అశుద్ధంలోని పురుగు కంటె అధముణ్ణి."

**బాబ్** : అలా వ్రాసుకున్నది ఎవరు?

**శ్రీల ప్రభుపాదులు** : 'చైతన్య చరితామృతము' ను రచించిన కృష్ణదాస కవిరాజు : "పురీషేర్ కీట్ హోయితే ముఇఁ సే లఘిష్ఠ." అతడేమీ ఆడంబరం కోసం చెప్పడం లేదు. అది అతని ఉద్దేశ్యం. "నేను అధమాధముడను - ప్రతివాడూ నాకంటె శ్రేష్ఠుడే! ప్రతివాడూ కృష్ణ సేవలో ఉన్నాడు. నేను ఆయన సేవలో లేను." అంటూ బాధపడ్డాడు. చైతన్య మహాప్రభువు ఇలా అన్నాడు : "ఓహో ! నాయందు

కృష్ణభక్తి అణువంత కూడా లేదు. నేను ఆడంబరం కోసం అరుస్తాను. నేను కృష్ణ భక్తుడనైతే చాలా కాలానికి ముందే మరణించి ఉండే వాణ్ణి. కాని నేనింకా జీవించి ఉన్నాను. అది నేను కృష్ణుణ్ణి ప్రేమించడం లేదన డానికి రుజువు." అదీ ఉత్తమ భక్తుని దృక్పథం - కృష్ణ భక్తిలో అతడు ఎంతగా మునిగి ఉన్నాడంటే అతడు ఇలా అంటాడు : "అన్నీ జరుగుతూనే ఉన్నాయి. కాని నీచతముడను కాబట్టి నేను భగవంతుణ్ణి చూడలేక పోతున్నాను." అలాంటి వాడు భాగవతోత్తముడు.

**బాబ్** : అంటే భక్తుడు ప్రతివ్యక్తి మోక్షం కోసం పనిచేయాలా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. భక్తుడు అధికారం గల ఒక ఆధ్యాత్మిక గురువు క్రింద పని చేయాలి. ఉత్తమ భక్తుణ్ణి అనుకరించ కూడదు.

**శ్యామసుందర దాస్** : మీ శిష్యుల పాప కార్యాల వలన కొన్ని సార్లు మీకు జబ్బు చేయడమో, లేక ఏదైనా బాధ కలుగడమో జరుగుతూ ఉంటుందని ఒకప్పుడు మీరు అన్నారు. ఒక్కొక్కప్పుడు దాని వలన కూడా వ్యాధి వస్తుందా? కేవలం ఆ కారణం వలననే కలుగుతుందా?

**శ్రీల ప్రభుపాదులు** : కృష్ణు డేమంటున్నాడో చూడండి :

అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః

"అన్ని పాపాల నుంచీ నిన్ను నేను విడిపిస్తాను." (భ.గీ.18.66) కాబట్టి కృష్ణుడు ఇతరుల పాపాల నన్నింటినీ రూపుమాపి, వెంటనే వారిని బాగుచేయగల శక్తిమంతు డన్నమాట. అయితే జీవు డెవ్వరైనా కృష్ణునిలాగా వ్యవహరిస్తే అతడు కూడా తన శిష్యుల పాపాలకు బాధ్యత వహించాలి. కాబట్టి గురువు అవడం అంత తేలిక పని కాదు చూశారా? అతడు విషా లన్నిటినీ మింగి జీర్ణించుకోవాలి. కాబట్టి కొన్ని సమయాలలో - అతడు కృష్ణుడు కాడు కాబట్టి కొన్ని చిక్కులు వస్తాయి. అందుకే శ్రీ చైతన్య మహాప్రభువు : "చాలామంది శిష్యుల్ని ప్రోగు చేసుకోకండి" అంటూ గురువులకు హితవు చెప్పాడు. కాని, ప్రచారం చేయడానికి చాలామంది శిష్యులు కావాలి. మనం బాధ పడ్డా ప్రచారం బాగా విస్తృతంగా



జరుగా లంటే శిష్యుల అవసరం తప్పదు. ఆధ్యాత్మిక గురువు తన శిష్యు లందరి పాపకార్యాల బాధ్యతా వహించవలసి ఉంటుంది. వారి పాపాలను అన్నింటిని హరించగల సామర్థ్యం లేకపోతే శిష్యులను పోగుచేసుకోడం ప్రమాదకరమైన పని.

వాంఛా కల్పతరుభ్యశ్చ కృపా సింధుభ్య ఏవ చ
పతితానాం పావనేభ్యో వైష్ణవేభ్యో నమో నమః

"నేను భగవద్భక్తులైన వైష్ణవులకు అందరికీ నమస్కరిస్తున్నాను. వారు అందరి కోరికలనూ తీర్చే కల్పవృక్షము వంటి వారు. పతితుల పట్ల వారు సంపూర్ణమైన దయ కలిగి ఉంటారు." ఆధ్యాత్మిక గురువు పతితు లందరి బాధ్యత తానే వహిస్తాడు. ఈ భావం బైబిలులో కూడా ఉంది. యేసుక్రీస్తు పాపాత్ముల పాపఫలాలను తాను గ్రహించి తన ప్రాణాలను త్యాగం చేశాడు. అది ఆధ్యాత్మిక గురువు బాధ్యత. ఎందుచేతనంటే కృష్ణుడు అపాపవిద్ధుడు - పాప కర్మలు అతనిని తాక లేవు. కాని జీవుడు చాలా అల్పుడు. కాబట్టి కొన్ని సమయాలలో వాటికి లోబడుతాడు. పెద్దమంట ఉంటుంది, చిన్నమంట ఉంటుంది. చిన్నమంటలో పెద్ద వస్తువులను వేస్తే ఆ మంట చల్లారి పోతుంది. పెద్దమంటలో ఏది వేసినా అది చల్లారదు. పెద్దమంట సమస్తాన్నీ దహించగలదు.

**బాబ్** : అయితే క్రీస్తు దుఃఖానుభవం అలాంటిదా?

**శ్రీల ప్రభుపాదులు** : దానిని గురించి నేను ఇంతకు ముందే వివరించాను. అతడు సకల మానవుల పాప ఫలాలనూ స్వీకరించాడు. కాబట్టి అతడు జీవితంలో చాలా కష్టపడ్డాడు.

**బాబ్** : అవును.

**శ్రీల ప్రభుపాదులు** : క్రీస్తు మానవు లందరి పాప ఫలాలను తానే స్వీకరించి ప్రాణత్యాగం చేశాడని బైబిలులో ఉంది. కాని ఈ క్రైస్తవులకు క్రీస్తు శ్రమపడడం,

తాము పాపాలు చేయడం ఒక అలవాటు అయిపోయింది. [బాబ్ చిరునవ్వు నవ్వాడు.] వారు అలాంటి మహా మూఢులు. తాము అన్ని రకాల పాపాలూ చేయగలందులకై తమ పాప ఫలాలను క్రీస్తు స్వీకరించేటట్లు ఒడంబడిక చేయించుకున్నారు. అది వారి మతం. క్రీస్తు వారి పాప ఫలాలను మోసి ప్రాణం త్యాగం చేసేటంత మహోదాత్తుడు. కాని ఆ త్యాగం క్రైస్తవులను పాప కార్యాలు చేయనీయకుండా ఆపగలిగిందా? వారు దానిని తెలుసుకోలేదు, సాధారణ విషయం లాగ భావించారు. "యేసు క్రీస్తును కష్టపడనీ! మనం సమస్త పాపాలను చేద్దాం" అనుకుంటున్నారు. అంతేనా?

**బాబ్** : అంతే! అంతే!

**శ్రీల ప్రభుపాదులు** : "యేసు ప్రభువు మా కోసం కష్టా లనుభవిస్తూ ఉంటే మేము పాప కృత్యాలను కొనసాగిస్తున్నాము" అని వారు సిగ్గుపడి ఉండ వలసింది. "నీవు చంపకూడదు" అని యేసు ప్రతివాడికీ చెప్పాడు. కాని : "యేసుక్రీస్తు ప్రభువు మనను క్షమించి మన పాప ఫలాలను అన్నిటినీ స్వీకరిస్తాడులే" అని అనుకుంటూ క్రైస్తవులు విచ్చలవిడిగా హింసను కొనసాగిస్తున్నారు. జరుగుతున్నది ఇది. మనం చాలా జాగ్రత్తగా ఉండాలి. "నా పాప కర్మ ఫలాన్ని నా ఆధ్యాత్మిక గురువు అనుభవిస్తాడు కాబట్టి నేను కొంచెం కూడా పాపం చేయను" అని శిష్యుడు భావించాలి. అది అతని కర్తవ్యం. దీక్షను గ్రహించిన తరువాత సమస్త పాపాలూ నశిస్తాయి. తరువాత అతడు మళ్ళీ పాపాలను చేస్తే అతని ఆధ్యాత్మిక గురువు ఆ ఫలితాలను అనుభవించవలసి వస్తుంది. శిష్యుడు ఈ విషయాన్ని సానుభూతితో ఆలోచించాలి, "నా పాప కర్మలకు ఫలితాన్ని నా ఆధ్యాత్మిక గురువు అనుభవిస్తాడు" అని తెలిసికోవాలి. ఆధ్యాత్మిక గురువుకు ఏదైనా వ్యాధి కలిగితే అది ఇతరుల పాప కర్మ ఫలము. "చాలా మంది శిష్యు లుండకూడదు." కాని మనం ప్రచారం చేస్తున్నాము గనుక ఎక్కువ మంది శిష్యులను చేర్చుకుంటున్నాము. ప్రమాదం లేదులెండి. కష్టాన్ని అనుభవిద్దాము. అయినా శిష్యులను మేము స్వీకరిస్తాము.



"నాకు కష్టం కలిగితే అది నా పూర్వజన్మ పాపఫలితమా?" అని కదూ మీ ప్రశ్న. అవును? అదే నా పాపం - అయోగ్యులైన వారిని కొంత మందిని శిష్యులుగా స్వీకరించడం. అదీ నా పాపం.

**బాబ్** : అయితే ఇది కొన్ని సందర్భాలలోనే జరుగుతుందా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. మేము చాలా మందిని స్వీకరిస్తున్నాము కనుక ఇలా తప్పకుండా జరుగుతూ ఉంటుంది. జాగ్రత్తగా ఉండవలసిన బాధ్యత శిష్యులపై ఉంది. "నా ఆధ్యాత్మిక గురువు నన్ను రక్షించాడు. ఆయనకు దుఃఖం కలిగించకూడదు" అని వారు అనుకోవాలి. ఆధ్యాత్మిక గురువుకు కష్టం వచ్చినప్పుడు కృష్ణుడు అతనిని రక్షిస్తాడు. "ఆహా! ఇతడు ఒక పతితుణ్ణి రక్షించడానికి ఎంతో బాధ్యత వహించాడు" అని కృష్ణుడు దయ తలుస్తాడు. అంటే, కృష్ణుడు అక్కడ ఉంటా డన్న మాట.

కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి

"ఓ కౌంతేయా! నా భక్తుడు ఎప్పుడూ నశించడని ధైర్యంగా ఘోషించు." (భ.గీ.9.31) ఎందుకంటే, కృష్ణుని కోసమే ఆధ్యాత్మిక గురువు అలాంటి సాహసానికి పూనుకుంటాడు.

**బాబ్** : మీ దుఃఖానుభవం అలాంటి బాధ కాదు కదా!

**శ్రీల ప్రభుపాదులు** : కాదు. అది కర్మఫలం కాదు. కొన్ని సమయాలలో బాధ కలుగుతుంది. దాని ద్వారా : "మా పాప ఫలం వలన మా ఆధ్యాత్మిక గురువు బాధ పడుతున్నారు" అని శిష్యులు గ్రహించగలుగుతారు.

**బాబ్** : మీరు ఇప్పుడు చాలా కులాసాగా ఉన్నట్లు కనిపిస్తున్నారు...

**శ్రీల ప్రభుపాదులు** : నేను ఎప్పుడూ కులాసాగానే ఉంటాను... ఒకవేళ ఏదైనా కష్టం వచ్చినా కృష్ణుడు నన్ను రక్షిస్తాడని నాకు తెలుసు. అయితే ఈ కష్టం నా పాపకర్మ ఫలం కాదు.

**బాబ్** : కాని ఒక విషయం ఉంది. నేను ఉంటున్న పట్టణంలోని నీళ్ళలో జబ్బు

ఉంది. కనుక నేను మరగ కాచిన నీళ్ళనే త్రాగుతాను. నాకు రోగం రావడం, రాకపోవడం నా కర్మఫలమే అయితే నేను మరగకాచిన నీళ్లు త్రాగవలసిన అవసరం ఏముంది? నేను ఎలాంటి నీళ్ళనయినా త్రాగవచ్చును కదా? అలా కాక నా ప్రవర్తన సరిగా లేకపోతే నేను ఎంత మంచి నీళ్ళు త్రాగినా వ్యాధి వస్తుంది.

**శ్రీల ప్రభుపాదులు** : మీరీ భౌతిక ప్రపంచంలో ఉన్నంత కాలం మీరు భౌతిక నియమాలను నిర్లక్ష్యం చేయకూడదు. మీరు ఒక అడవిలోకి వెళ్ళా రనుకోండి. అక్కడ ఒక పులి ఉందనీ, అది మీ మీదకు వస్తుందనీ మీకు తెలుసు. మీరు ఎందుకు స్వచ్ఛందంగా పోయి దాని నోట్లో పడాలి? భక్తుడు భౌతిక శరీరం ఉన్నంత కాలం భౌతికమైన అపాయం కొని తెచ్చుకోవా లని అర్థం కాదు. అలా చేయడం ద్వారా భౌతిక సూత్రాలను ఎదిరించలేము : "నేను భక్తుణ్ణి అయ్యాను, ఇంక ప్రతిదానినీ ఎదిరించగలను'' అనుకోడం మూఢత్వం.

అనాసక్తస్య విషయాన్ యథార్హ ముపయుంజతః
నిర్బంధః కృష్ణ సంబంధే యుక్తం వైరాగ్య ముచ్యతే

సంగము (వ్యామోహం) లేకుండ శరీర పోషణకు అవసరమైన వాటిని స్వీకరించ వచ్చునని భక్తునికి సూచించబడింది. (శ్రీల రూప గోస్వామి వ్రాసిన 'భక్తి రసామృత సింధువు'.) భక్తుడు మరగకాచిన నీళ్ళు త్రాగుతాడు. అలా కాచిన నీళ్ళు దొరకకపోతే అతడు నీళ్ళే త్రాగడని అర్థమా? అవి దొరకకపోతే మామూలు నీళ్ళే త్రాగుతాడు. మేము కృష్ణప్రసాదాన్ని తీసుకుంటాము. అయితే ప్రచారానికి వెళ్ళినప్పుడు కొన్ని సార్లు మేము అన్న విక్రయశాలలో లభించిన అన్నాన్నే తింటాము. "నేను భక్తుణ్ణి కాబట్టి అన్న విక్రయశాలలోని ఆహార పదార్థాలను తినను. పస్తు ఉంటాను'' అని భావించడం ఉచితమా? పస్తు ఉంటే నీరసిస్తాను. ఇంకే ప్రచారం చేయలేను.

**బాబ్** : భక్తుడు తన వ్యక్తిత్వాన్ని కొంత కోల్పోతాడా?

**శ్రీల ప్రభుపాదులు** : కోల్పోడు. కృష్ణుణ్ణి సంతోషపెట్టడానికి అతనికి పూర్తిగా



వ్యక్తిత్వం ఉంటుంది. "నన్ను శరణు పొందు'' అంటున్నాడు కృష్ణుడు. భక్తుడే స్వచ్ఛందంగా శరణు పొందుతాడు. అంటే, అతని వ్యక్తిత్వం పోయిందని కాదు. అతడు తన వ్యక్తిత్వాన్ని నిలుపు కుంటాడు. సరిగ్గా అర్జునుడిలాగే - అర్జునుడు తన వ్యక్తిత్వం కారణంగానే మొట్ట మొదట యుద్ధం చేయడానికి నిరాకరించాడు. కాని, కృష్ణుణ్ణి తన ఆధ్యాత్మిక గురువుగా స్వీకరించి అతనికి శిష్యు డయ్యాడు. ఇక ఆ తరువాత కృష్ణుడు చెప్పిన ప్రతిదానికీ సరే అన్నాడు. అంత మాత్రంచేత అర్జునుడు తన వ్యక్తిత్వాన్ని కోల్పోయాడని అర్థం కాదు. అతడు స్వచ్ఛందంగానే అంగీకరించాడు : "కృష్ణుడు చెప్పినట్లు చేస్తారు.'' వారు తమ వ్యక్తిత్వాన్నికోల్పోలేదు. కాని తమ వ్యక్తిత్వాన్ని సమర్పించారు. అది అవసరం. ఉదాహరణకు ఒకడు మైథునం చేయడు. దాని అర్థం అతడు నపుంసకుడని కాదు. కావా లనుకుంటే వేయి స్త్రాైనా మైథునం చేయగలడు. కాని, అతడు దానిని బుద్ధి పూర్వకంగా, స్వచ్ఛందంగా విడిచి పెట్టాడు. "పరం దృష్ట్వా నివర్తతే'': అతని అభిరుచి ఉన్నత స్థాయిలో ఉంది. కొన్ని సమయాలలో మనం ఉపవాసం చేస్తాము. అంటే మనం వ్యాధి గ్రస్తులమని కాదు. బుద్ధి పూర్వకంగా ఉపవాసం చేస్తాము. ఆకలి లేకా కాదు, తినలేకా కాదు. బుద్ధి పూర్వకంగా ఉపవాసం చేస్తాము.

**బాబ్** : ఆత్మార్పణ చేసిన భక్తుడికి వ్యక్తిగత అభిరుచులు అంటూ ఇంకా ఉంటాయా?

**శ్రీల ప్రభుపాదులు** : ఉంటాయి, పూర్తిగా ఉంటాయి.

**బాబ్** : అతనికి వ్యక్తిగత ఇష్టానిష్టాలు ఉంటాయా?

**శ్రీల ప్రభుపాదులు** : ఉంటాయి. అతనికి అన్నీ ఉంటాయి. అయితే అతడు కృష్ణుణ్ణి ఎక్కువగా అభిమానిస్తాడు. నాకు ఈ వస్తువు అంటే ఇష్టం అనుకోండి. కృష్ణుడు : "వద్దు, దీనిని నువ్వు ఉపయోగించకూడదు'' అంటాడు. అప్పుడు నేను దానిని ఉపయోగించను. అది కృష్ణుని కోసం చేసే పని.

నిర్బంధః కృష్ణ సంబంధే యుక్తం వైరాగ్య ముచ్యతే

కృష్ణు డిలా స్పష్టంగా చెప్పాడు : "నాకు ఈ విషయాలు ఇష్టం" అని. కాబట్టి కృష్ణుడికి ఇష్టమైన వాటినే మనం సమర్పించాలి. అప్పుడు మనం ప్రసాదం తీసుకుంటాము. కృష్ణుడికి రాధారాణి ఇష్టురాలు. కాబట్టి గోపిక లందరు రాధారాణిని కృష్ణుని దగ్గరకు చేర్చడానికి ప్రయత్నిస్తారు. "కృష్ణుడికి ఈమె ప్రియురాలు. చాలా బావుంది. ఈమెను ముందుకు త్రోయండి." అది కృష్ణ చైతన్యం. కృష్ణుని ఇంద్రియాలను తృప్తిపరచడం. అంతేకాని నా ఇంద్రియాలను తృప్తి పరచుకోడం కాదు. అది భక్తి. అదే కృష్ణప్రేమ అనబడుతుంది. అది కృష్ణుని పట్ల ప్రేమ. "ఆహా! కృష్ణుడికి ఇది ఇష్టం. దీనిని నేను ఇవ్వాలి."

**బాబ్** : ఇక్కడ కొంత ప్రసాదం ఉంది. [అంటే కృష్ణునికి నైవేద్యము పెట్టిన ఆహారం.] దానిని అందరికీ పంచిపెడుతారు. తరువాత మనం దానిని తింటాము. అయితే అందులో కొన్ని రకాలు నాకు బావుంటాయి, కొన్ని నాకు బొత్తిగా రుచించడం లేదు.

**శ్రీల ప్రభుపాదులు** : మీరు అలా చేయకూడదు. సంపూర్ణత్వం అంటే కృష్ణుడికి ఏది సమర్పించ బడినా మీరు దానిని స్వీకరించాలి. అది సంపూర్ణత్వం. "నాకు అది ఇష్టం ఇది ఇష్టం లేదు" అనకూడదు. అంటే భేదాలు పాటించినంత కాలం మీకు ప్రసాద మహిమ తెలియ దన్నమాట.

**ఒక శిష్యుడు** : ఇష్టం, అనిష్టం గురించి మాట్లాడితే ఏమవుతుంది? ఎవరో ఏదో ప్రసాదాన్ని వండుతున్నారనుకోండి...

**శ్రీల ప్రభుపాదులు** : ఇష్టపడడం పనికి రాదు. ఇష్టపడకపోవడం పనికి రాదు. కృష్ణుడికి ఏది ఇష్టమో అది బాగా ఉన్నట్లే.

**ఒక శిష్యుడు** : సరే! ఎవరో దేనినో కృష్ణుడికి ప్రసాదాలుగా వండారనుకోండి. దానిని బాగా వండలేదనుకోండి అప్పు డది...

**శ్రీల ప్రభుపాదులు** : కాదు. హృదయ పూర్వకముగా భక్తితో వండితే అది కృష్ణుడికి ఇష్ట మవుతుంది. విదురుడిలాగ. విదురుడు కృష్ణుడికి అరటిపళ్లు



సమర్పిస్తూ, పరధ్యానంలో పండ్లను పారవేస్తూ తొక్కలను కృష్ణుడికి ఇచ్చాడు. కృష్ణుడు వాటినే (తొక్కలను) ఆరగించాడు. [అందరు నవ్వుతారు.] విదురుడు వాటిని భక్తితో ఇస్తున్నా డని కృష్ణుడికి తెలుసు. భక్తితో ఇస్తే కృష్ణుడు ఏదయినా ఆరగిస్తాడు. అది జిహ్వకు భౌతికంగా బాగుందా లేదా అనేది లెక్క కాదు. అదే విధంగా భక్తుడు కృష్ణుని ప్రసాదం రుచిగా ఉన్నా లేకపోయినా తీసుకుంటాడు. మనం ప్రసాదము అన్న ప్రతిదానినీ స్వీకరించాలి.

**ఒక శిష్యుడు** : భారత దేశంలో లాగ భక్తి లేకపోతే...

**శ్రీల ప్రభుపాదులు** : భక్తి లేకపోతే రుచిగా ఉన్నా లేకపోయినా కృష్ణునికి ఇష్టం ఉండదు. దానిని తీసుకోడు.

**ఒక శిష్యుడు** : భారత దేశంలో... ఒకడు...

**శ్రీల ప్రభుపాదులు** : ఓహో! భారతదేశం, భారతదేశం! భారతదేశం గురించి మాట్లాడవద్దు. తత్త్వం గురించి మాట్లాడండి. భక్తి లేకపోతే దానిని కృష్ణుడు స్వీకరించడు. భారతదేశంలో కాని, మీ దేశంలో కాని రుచిగా ఉంది కాబట్టి, చాలా డబ్బు ఖర్చు పెట్టి చేశారు కాబట్టి దానిని స్వీకరించ వలసిన అవసరం కృష్ణుడికి లేదు. కృష్ణుడికి వైకుంఠంలో రుచి గల పదార్థాలు చాలా ఉన్నాయి. మీ ఆహారం కోసం అతడు పరితపించడం లేదు. ఆయనకు కావలసింది కేవలం మీ భక్తి. ముఖ్యమైనది భక్తి. అంతేకాని ఆహారం కాదు. ఈ భౌతిక ప్రపంచంలోని ఏ ఆహారమైనా కృష్ణుడు స్వీకరించడు. భక్తిని మాత్రమే స్వీకరిస్తాడు :

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః

"ఎవరైనా నాకు ప్రేమతోనూ భక్తితోనూ ఆకునుగాని, పూవును గాని, పండును గాని, నీటిని గాని అర్పిస్తే దానిని నేను అంగీకరిస్తాను." (భ.గీ.9.26) "ఎందుచేతనంటే, అది నాకు భక్తితో, ప్రేమతో సమర్పించబడింది గనుక" -

ముఖ్యంగా కావలసింది భక్తి. అందుకే భక్తుడు కాని వానిని వండనివ్వము. భక్తి లేని వాళ్ళ చేతుల నుంచి కృష్ణు డేమీ స్వీకరించడు. అతడు ఎందుకు స్వీకరించాలి? అతనికి ఆకలి లేదు. అతనికి ఆహారమేమీ అక్కరలేదు. భక్తి మాత్రమే అతనికి కావలసింది. అది చాలు. అదే ముఖ్యమైన విషయం. కాబట్టి ఎవరైనా భక్తుడు కావాలి. మంచి వంటవాడు కానక్కరలేదు. అయితే భక్తి ఉన్నవాడు మంచి వంటవాడు కూడా అవుతాడు. తనంతట తానే మంచి వంటవాడిగా మారిపోతాడు. కాబట్టి భక్తు డవడం మాత్రమే కావలసింది. మిగిలిన అర్హతలన్నీ వాటంతట అవే వస్తాయి. అతడు భక్తుడు కానప్పుడు మంచి అర్హతలు ఎన్ని ఉన్నా వృథా అవుతాయి. అతడు తన మనోరథాల ప్రకారమే వర్తిస్తున్నాడు గనుక అతనిలో ఎట్టి సద్గుణాలు ఉండవు. [సంభాషణలో చాలా సేపు విరామం.]

**శ్రీల ప్రభుపాదులు** : ఇప్పుడు సమయం ఎంత అయింది?

**శ్యామసుందర దాస్** : ఆరు గంటలు.

**శ్రీల ప్రభుపాదులు** : ప్రశ్నలు వేయడం, జవాబులు చెప్పడం అవసరం. అవి అందరికీ ఉపయోగపడుతాయి.

**బాబ్** : ప్రసాదానికి సంబంధించి నాకు మరో ప్రశ్న ఉంది.

**శ్రీల ప్రభుపాదులు** : సూత గోస్వామి ఇలా అన్నాడు (భాగ.1.2.5) :

మునయః సాధు పృష్టో ఽహం భవద్భి ర్లోకమంగళమ్
యత్కృతః కృష్ణ సంప్రశ్నో యేనాత్మా సుప్రసీదతి

"ఋషులారా, మీరు నన్ను చక్కగా ప్రశ్నించారు. మీ ప్రశ్నలు కృష్ణుడికి సంబంధించినవి కాబట్టి అవి మంచివి, లోక కల్యాణానికి సంబంధించినవి. ఇటువంటి ప్రశ్నల ద్వారానే ఆత్మ పూర్తిగా సంతృప్తి చెందుతుంది.'' 'కృష్ణ సంప్రశ్నః' ఇది చాలా మంచిది. దీనిని చర్చించడం, వినడం 'లోక మంగళమ్' - ప్రతివారికీ క్షేమకరం. ప్రశ్నలూ, సమాధానాలూ రెండూ అవసరమే.



**బాబ్** : ప్రసాదం గురించి నాకు ఇంకా బాగా అర్థం కాలేదు. దానిని గురించి ఇంకా బాగా ఆలోచించి, మీ కభ్యంతరం లేకపోతే, రేపు మిమ్మల్ని అడుగుతాను.

**శ్రీల ప్రభుపాదులు** : ప్రసాదం ఎప్పుడూ ప్రసాదమే! అయితే మనం ఇంకా తగినంత స్థాయికి ఎదుగలేదు కాబట్టి కొన్ని ప్రసాదాలు మనకు ఇష్టం ఉండడం లేదు.

**బాబ్** : నా అభిప్రాయం ఏమిటంటే కొన్ని ప్రసాదాలలో మసాలాల ఘాటు ఎక్కువగా ఉంది, నా జీర్ణశక్తి దెబ్బ తింటూ ఉంది.

**శ్రీల ప్రభుపాదులు** : అలా అయితే... అది కూడా సరిగా అర్థం చేసుకోక పోవడం వల్లనే. వంటవాడికి కూడా కొంత ఆలోచన ఉండాలి. కృష్ణుడికి మేలిరకం వంటకాలే నైవేద్యం పెట్టాలి. మరి అతడు తన ధర్మాన్ని నెరవేర్చడం లేదని అర్థం. కాని భక్తుడు సమర్పించిన దేనినైనా కృష్ణుడు స్వీకరిస్తాడు. భక్తుడు ఎలాంటి ప్రసాదాన్నైనా, అది ఎంత ఘాటుగా ఉన్నా తీసికోగలడు. హిరణ్యకశిపుడు తన పుత్రుడు ప్రహ్లాదుడికి విషం పెట్టాడు. [ప్రహ్లాదుడు దానిని కృష్ణుడికి నివేదించాడు.] ఆ బాలుడు దానిని అమృతం లాగ త్రాగాడు. కనుక ఇతరుల రుచికి అది ఘాటుగా ఉన్నా భక్తుడికి అది రుచిగానే ఉంటుంది. ఘాటుగా ఉంది అనే ప్రశ్న ఏమిటి? ప్రహ్లాదుడికి అసలైన విషమే ఇచ్చారు. రాక్షసి పూతన కూడా కృష్ణుడికి విషం ఇచ్చింది. కృష్ణుడు ఎంత మంచివాడు అంటే "ఆమె నన్ను నా తల్లిలాగ స్వీకరించింది'' అని భావించాడు. కాబట్టి కృష్ణుడు ఆమె విషాన్ని తీసుకుని, ఆమెకు మోక్షం ఇచ్చాడు. కృష్ణుడు చెడును గ్రహించడు. మంచివాడు చెడును గ్రహించడు. మంచినే గ్రహిస్తాడు. నా సచ్ఛాత్రసోదరులలో ఒకరిలాగ అతడు నా ఆధ్యాత్మిక గురువుగారితో వ్యాపారం చేయా లనుకున్నాడు. మా గురువుగారు అతనిలో ఉన్న చెడును గ్రహించలేదు. మంచినే తీసికొన్నారు. "ఇతడు నాకు సేవ చేయడానికి ముందుకు వచ్చాడు'' అనుకున్నాడు.

**బాబ్** : ఏమిటిది? ఎవరితో వ్యాపారం?

**శ్రీల ప్రభుపాదులు** : నేను మా గురువుగారిని గురించి మాట్లాడుతున్నాను.

**బాబ్** : ఓహో! అలాగా? వేయవచ్చునని అంటే ప్రసాదం గురించి ఒక ప్రశ్న వేస్తాను. ఒక భక్తుడికి ఒక జబ్బుఉందనుకుందాం. ఒక విధమైన ఆహారం అతడు తినరాదు - కొందరికి అజీర్ణం జబ్బు ఉండడం వలన నెయ్యి తినరాదు - మరి అలాంటి భక్తులు ఏ ప్రసాదాన్నైనా తినాలా?

**శ్రీల ప్రభుపాదులు** : తినకూడదు. తినకూడదు. ఉత్తమ భక్తులు కానివారు కొన్నిటిని తినడం మానివేయవచ్చును. కాని, ఉత్తమ భక్తుడికి భేద భావం ఉండదు. ఉత్తమ భక్తుడు చేసినట్లు మీరు చేయడం ఎందుకు? భేద భావం ఉన్నంత వరకూ మీరు ఉత్తమ భక్తులు కాలేరు. కాబట్టి మీరు ఉత్తమ భక్తుణ్ణి అనుకరించి ప్రతిదానినీ తినడం ఎందుకు?

**బాబ్** : అలాగా?

**శ్రీల ప్రభుపాదులు** : ముఖ్యవిషయం ఏమిటంటే - ఉత్తమ భక్తుడికి ప్రసాదం రుచులలో భేద భావం ఉండదు. కృష్ణుడికి నివేదించబడింది ఏదైనా అమృతమే. అంతే. భక్తు డేది సమర్పించినా కృష్ణుడు స్వీకరిస్తున్నాడు. అలాగే భక్తుడు కూడా ఏ ప్రసాదాన్నైనా స్వీకరించాలి. ముఖ్యమైన అంశం అర్థం కాలేదా? ఉత్తమ భక్తుడికి భేద భావం ఉండదు. కాని, నేను విశుద్ధ భక్తుణ్ణి కానప్పుడు, భేద భావం ఉన్నప్పుడు, సంపూర్ణ భక్తుణ్ణి నేను అనుకరించడం ఎందుకు? నేను ఉత్తమ భక్తుణ్ణి కానప్పుడు, ప్రతి వస్తువును జీర్ణం చేసుకోడం సాధ్యం కాకపోవచ్చును, భక్తుడు మూఢత్వంతో ఉండకూడదు. "కృష్ణ జే భజే, సే బర చతుర్" అని అన్నారు. కాబట్టి భక్తుడికి తన స్థితి ఏమిటో తనకు తెలుస్తుంది. ఎవరితో ఎలా వ్యవహరించాలో కూడా అతనికి తెలుస్తుంది.

# 7. కృష్ణ చైతన్యంతో జీవించడం

## 1972 ఫిబ్రవరి 29

**(సాయంత్రం సంభాషణ ఇంకా ఇలా కొనసాగింది)**

**ఒక భారతీయ భక్తుడు** : ఎలాంటి పనులు చేస్తే మంచి కర్మను సంపాదించ గలం?

**శ్రీల ప్రభుపాదులు** : మంచి కర్మ ఏదో వేదాలు విధించాయి. ప్రతి వారూ యజ్ఞం చేయా లని ఆదేశించబడింది. యజ్ఞం అంటే దేవదేవుడైన విష్ణుమూర్తి సంతోషం కోసం చేసే పనులు. కాబట్టి సత్కర్మలు అంటే, వేదవాఙ్మయం ఆదేశాల ప్రకారం యజ్ఞం చేయడం. ఆ యజ్ఞాలకు ప్రయోజనం దేవదేవుణ్ణి సంతోషింప చేయడమే. శాసన బద్ధంగా నడుచుకొనే మంచి పౌరుడు అంటే ఎవరు? ఎవరి పనులు ప్రభుత్వాన్ని సంతోషపెడుతాయో వాడు. అలాగే, సుకృతం అంటే ఏది విష్ణుదేవుణ్ణి సంతోషపెడుతుందో అది. దురదృష్టవశాత్తు దేవదేవుని పురుషోత్తమ రూపం ఆధునిక నాగరకతకు తెలియదు. ఇక అతనిని సంతోషపెట్టడం తెలియదని వేరే చెప్పాలా? ప్రజల కేమీ తెలియదు. వారు కేవలం భౌతిక వ్యవహారాలలో మునిగి ఉంటారు. అందుకే వారు దుష్కర్మలను మాత్రమే చేస్తూ దుఃఖాన్ని అనుభవిస్తున్నారు. స్వయంగా గుడ్డివాళ్ళయి, గుడ్డి వాళ్ళకు నాయకులవుతున్నారు. ఉభయులూ దుష్కర్మల వలన దుఃఖం అనుభవిస్తున్నారు. ఇవి తెలిసికోడం సులభం. మీరు ఏదైనా నేరం చేస్తే కష్టాలకు గురి అవుతారు. ప్రభుత్వానికీ, ప్రజలకూ మేలు చేస్తే మీకు కీర్తి లభిస్తుంది. కొన్ని సందర్భాలలో మీకు బిరుదులు కూడా లభిస్తాయి. సుకృతం, దుష్కృతం అంటే ఇవి. కాబట్టి సుకృతం అంటే మీకు కొంచెం భౌతిక సుఖం లభిస్తుందని అర్థం. దుష్కృతం

అంటే భౌతిక దుఃఖం అనుభవిస్తా రని అర్థం. సుకృతం వలన మీరు మంచి కుటుంబంలో పుట్టి భాగ్యవంతులవుతారు. మీరు అందంగా కూడా ఉంటారు. [కొంత సమయం మౌనం.]

**బాబ్** : మరి భగవంతుణ్ణి గురించి అంతగా తెలియని వాడి సంగతి ఏమిటి?

**శ్రీల ప్రభుపాదులు** : అలాంటి వాడు పశువు. పశువులకు మంచి గురించి తెలియదు. భగవంతుణ్ణి గురించి అర్థం చేసుకోని వాడు, అర్థం చేసుకోడానికి ప్రయత్నించని వాడు పశువు. ఎటొచ్చీ పశువుకు నాలుగు కాళ్ళు ఉంటాయి. ఈ పశువుకు రెండు కాళ్ళే ఉంటాయి. డార్విన్ వాదం ప్రకారం వారు కోతులు. కాబట్టి భగవంతుణ్ణి ఎరుగని వాడు, తెలిసికోడానికి ప్రయత్నించని వాడు పశువు మాత్రమే అవుతాడు.

**బాబ్** : మరి అమాయికుల మాట ఏమిటి?

**శ్రీల ప్రభుపాదులు** : ప్రతి పశువూ అమాయకమైందే! దాని గొంతు కోసినా అది వద్దనదు. కాబట్టి అమాయకత ఏమంత గొప్పగుణం కాదు. మనం చాలా తెలివి తేటలతో ఉండాలని మా ప్రతిపాదన. అప్పుడు కృష్ణుణ్ణి తెలిసికోడానికి అవకాశం కలుగుతుంది. అమాయకంగానూ, అజ్ఞానిగానూ ఉండడం ఏమంత మంచి గుణం కాదు. నిరాడంబరత్వం మంచిదే. కాని ఎవరూ తెలివి తక్కువగా ఉండకూడదు.

**బాబ్** : తెలివితేట లంటే ఏమిటో మళ్ళీ చెబుతారా?

**శ్రీల ప్రభుపాదులు** : తెలివి అంటే... తాను ఎవరో, ఈ ప్రపంచం ఏమిటో, భగవంతు డెవరో, ప్రపంచానికీ భగవంతుడికీ, తనకీ మధ్య ఉన్న సంబంధా లేమిటో తెలిసి ఉండడం. పశువుకు తా నెవరో తెలియదు. తన దేహమే తా ననుకుంటుంది. అదే విధంగా తా నెవరో తెలియనివాడు తెలివి గలవాడు కాడు.

**బాబ్** : ఏది మంచిదో దానిని చేస్తూ, మంచినే చేయడానికి ప్రయత్నిస్తూ, కార్యాకార్య విచక్షణ గలవాడై, తాను చేసే పనులను గురించి అజ్ఞానిగా కాకుండా జాగ్రత్తతో ఉన్న వాని సంగతి ఏమిటి? ఒక సేవకుడు తన యజమాని పట్ల నిజాయితీగా ఉంటాడు. అతడు తన యజమానిని మోసగించినా పట్టుబడనని తెలిసినా విశ్వాసపాత్రుడుగా ఉంటాడు - మరి అలాంటి వాడి మాట ఏమిటి? అది కూడా ఒక విధమైన సత్కర్మ అవుతుందా?



**శ్రీల ప్రభుపాదులు** : అవును. సత్ ప్రవర్తన కూడా సత్కర్మే! సజ్జను డవడం ఎలాగో భగవద్గీత (16.5)లో వివరించబడింది :

దైవీ సంపద్ విమోక్షాయ నిబంధాయాసురీ మతా

కాబట్టి మీరు దైవ సంపదను పొందితే (భౌతికాతీత గుణాలు కలవారైతే) అప్పుడు 'విమోక్షాయ': ముక్తు లవుతారు. ఇక 'నిబంధాయా సురీ' : మీరు అసుర సంపదను పొందినట్లయితే మీకు బంధం అంత కంతకు బిగుస్తుంది. దురదృష్టవశాత్తు ఆధునిక నాగరకులకు బంధం అంటే ఏమిటో, మోక్షం అంటే ఏమిటో తెలియదు. వారు అంతటి అజ్ఞానులు. వారి కేదీ తెలియదు. మిమ్మల్ని నేను మోక్షం అంటే ఏమిటని అడిగాననుకోండి, సమాధానం చెప్పగలరా? [సమాధానం లేదు.] అలాగే, బంధం అంటే ఏమి టని అడిగితే సమాధానం చెప్పగలరా? [మళ్ళీ ఏ జవాబూ లేదు.] బంధం, మోక్షం అనే ఈ పదాలు వేద సారస్వతంలో ఉన్నాయి. కాని, ఈనాడు బంధం అంటే ఏమిటో, మోక్షం అంటే ఏమిటో ప్రజలకు తెలియదు. వారు అంత అజ్ఞానులు, అంత మూఢులు! అయినా తాము ఎంతో జ్ఞానార్జన చేసినట్లు గర్వపడుతూ ఉంటారు. పోనీ మోక్షం అంటే ఏమిటో మీరు చెప్పగలరా? మీరు కళాశాలలో ఆచార్యులు, ఆధ్యాపకులు కదా! మోక్షం అంటే ఏమిటో వివరించి చెప్పగలరా?

**బాబ్** : సరిగా చెప్పలేను, ఎందుచేత నంటే, నేను వివరించి చెప్పగలిగితే నాకు తొందరగానే విముక్తి లభించి ఉండేది.

**శ్రీల ప్రభుపాదులు** : మీకు మోక్షం అంటే ఏమిటో తెలియకుండానే అది ఎంత

త్వరగా వస్తుందో, ఎంత ఆలస్యంగా వస్తుందో ఎలా చెప్పగలరు? [అందరూ నవ్వుతారు.] మోక్షం అంటే ఏమిటో తెలియని పక్షంలో మోక్షం సిద్ధించే ప్రశ్నే లేదు. అది త్వరగా వచ్చేదీ కాదు. ఆలస్యంగా వచ్చేదీ కాదు. మొదట మీరు మోక్షం అంటే ఏమిటో తెలుసుకోవాలి. రైలుబండి ఎక్కడికి వెళ్తుందో తెలియనప్పుడు అది వేగంగా వెళుతుందా ఆలస్యంగా వెళుతుందా అని తెలిసికోడం వల్ల లాభం ఏముంది? మీ గమ్యస్థానం ఏదో మీకు తెలియాలి. మోక్షం అంటే ఏమిటి?

**బాబ్** : మరేమో...

**శ్రీల ప్రభుపాదులు** : ఇప్పుడు ఈ ప్రశ్న నేను మిమ్మల్ని అడుగుతున్నాను. ప్రతి రోజూ మీరు నన్ను అడుగుతున్నారు. ఇప్పుడు నేను మిమ్మల్ని అడుగుతున్నాను.

**బాబ్** : [నవ్వుతాడు.] అలాగే? సరే... కొంచెం సేపు ఆలోచిస్తాను.

**శ్రీల ప్రభుపాదులు** : మోక్షం శ్రీమద్భాగవతం (2.10.6)లో ఇలా వర్ణించబడింది:

ముక్తి ర్హిత్వాన్యథా రూపం స్వరూపేణ వ్యవస్థితిః

అంటే పనికిమాలిన వేషాలన్నిటినీ మానివేసి మన నిజమైన స్థితిలో ఉండి పోవడం. అయితే ఇది కూడా చాల గందరగోళంగా ఉంది. ఎందుచేతనంటే తన స్వస్థితి అంటే ఏమిటో ఎవరికీ తెలియదు. ఎలా ప్రవర్తించాలో తెలియదు. ప్రజలు సాధారణంగా నానావిధాలుగా ప్రవర్తిస్తూ ఉంటారు. ఏది సరియైన విధానమో వారికి తెలియదు. ఆధునిక మానవులకు తమ తమ జీవితాలను గురించి జ్ఞానం చాలా తక్కువ. ఇది దారుణమైన పరిస్థితి. ఇది వారికి తెలియదు.

**బాబ్** : సరియైన ప్రవర్తన కలవా డెవరో చెప్పగలరా?

**శ్రీల ప్రభుపాదులు** : 'నిజాయితీ' అంటే ఏమిటో తెలియని వాడు సరిగా ఎలా ప్రవర్తిస్తాడు? 'నిజాయితీ' అంటే ఏమిటో మీకు తెలిస్తే మీ ప్రవర్తన సరిగా ఉంటుంది. 'నిజాయితీ' అంటే ఏమిటి? మొదట దానిని వివరించి చెప్పండి.



**బాబ్** : మరేమో... ఏది మంచిదనుకుంటామో దానిని చేయడం.

**శ్రీల ప్రభుపాదులు** : "నా బిడ్డల పోషణకు నేను దొంగతనం చేయవచ్చు. అది సరియైనది" అని దొంగ అనుకుంటాడు. అలాగ అని అతని ప్రవర్తన సరియైనదనా అర్థం? ప్రతివాడూ అలాగే భావిస్తాడు. కసాయివాడు ఇలా అనుకుంటాడు : "ఇదే నా జీవన విధానం. నేను ప్రతీ రోజూ జంతువుల తలలు నరకాలి." అలాగే - ఆ వేటగాడి పేరేమిటి? నారదముని అతనిని కలుసుకుంటాడు.

**శ్యామసుందర దాస్** : మృగారి.

**శ్రీల ప్రభుపాదులు** : అవును. మృగారి. "నువ్వెందుకు ఇలా చంపుతున్నావు?" అని నారదుడు అతడిని అడిగాడు. వాడు ఇలా అన్నాడు : "ఓహో! ఇది నా వృత్తి. మా తండ్రి దానిని నాకు నేర్పాడు." కాబట్టి వాడు దానిని ఎంతో శ్రద్ధగా నిర్వర్తిస్తూ ఉన్నాడు. అందుచేత తప్పు ఒప్పులు ఆ యా సంస్కృతులను బట్టి ఉంటాయి. దొంగల సంస్కృతి వేరు. దొంగతనం చేయడం సరియైనదే అని దొంగ అనుకుంటాడు.

**బాబ్** : అయితే మరి 'నిజాయితీ' అంటే ఏమిటి?

**శ్రీల ప్రభుపాదులు** : ఔను. అదే నా ప్రశ్న. [ప్రతివాడూ నవ్వుతాడు.] 'నిజాయితీ' అంటే ఇతరుల వస్తువులను గ్రహించకుండా ఉండడం. అదే నిజాయితీ. ఉదాహరణకు : ఇది నేను వ్రాసుకునే బల్ల. మీరు వెళ్లి పోయేటప్పుడు దీనిని ఎత్తుకొని పోవా లనుకోవడం నిజాయితీయా? కాదు. కాబట్టి మీరు ఇతరుల హక్కులకు భంగం కలిగించకుండా ఉండడం 'నిజాయితీ'కి సామాన్య లక్షణం. అంతే!

**బాబ్** : కాబట్టి 'నిజాయితీ' ఉన్నవాడు సత్త్వగుణంతో ఉన్నట్లు? అంతేనా?

**శ్రీల ప్రభుపాదులు** : కచ్చితంగా. ఎందుచేతనంటే సత్త్వగుణం అంటేనే జ్ఞానం. కాబట్టి : "ఈ వ్రాతబల్ల నాది కాదు, స్వాముల వారిది" అని మీకు తెలిస్తే, దానిని ఎత్తుకొని పోడానికి ప్రయత్నించరు. అందుచేత ప్రతి వ్యక్తీ సరిగా ప్రవర్తించడం

అంటే ఏమిటో సంపూర్ణంగా తెలుసు కోవాలి. అప్పుడు అతడు సరియైన ప్రవర్తన కలిగి ఉంటాడు.

**బాబ్ :** మీరు ఇప్పుడు సత్త్వగుణం భగవంతుని గురించిన జ్ఞాన మని చెప్పారు. భగవంతుని గురించి తెలియకుండానే ఎవరైనా నిజాయితీ కలిగి ఉండవచ్చు కదా?

**శ్రీల ప్రభుపాదులు :** అంటే?

**బాబ్:** తాను నిజాయితీ కలిగి ఉండడం భగవంతుని సంకల్పం అని భావించకుండా తాము సరియైన ప్రవర్తన కలిగి ఉండాలని భావించేవారు.

**శ్రీల ప్రభుపాదులు :** ప్రతివాడికీ నిజాయితీ ఉండా లనేది భగవంతుని కోరిక. భగవంతుడు మరోలా ఎందుకు భావిస్తాడు?

**బాబ్ :** ఒకవేళ భగవంతుని కోరికను అనుసరిస్తున్నామని తెలియకుండానే భగవదిచ్ఛను అనుసరించవచ్చును కదా? అంటే సత్త్వగుణంలో ఉన్నవారిలాగ...

**శ్రీల ప్రభుపాదులు :** లేదు. తెలియకుండా అనుసరించడం అసంబద్ధం. భగవంతుని శాసనాన్ని తెలుసుకోవాలి. అప్పుడు మీరు దానిని అనుసరిస్తే అదీ 'నిజాయితీ'.

**బాబ్ :** అయితే, భగవంతుణ్ణి తెలిసికోని వాడు సక్రమ మార్గంలో ఉండడా?

**శ్రీల ప్రభుపాదులు :** ఉంటాడు. కారణం భగవంతుడు సర్వజగదధిపతి. సర్వజగద్ భోక్త. సర్వులకు మిత్రుడు అని భగవద్గీత తెలుపుతూంది. ఈ మూడు విషయాలూ తెలిసికొన్న వాడు సంపూర్ణ జ్ఞాని అవుతాడు. ఉదాహరణకు: శరీరంలో ఉదరం 'భోక్త' అనీ కాళ్ళూ, చేతులూ, చెవులూ, కళ్ళూ భోక్తలు కావనీ ప్రతివాడికీ తెలుసు. ఉదరానికి సహాయం చేయడానికే అవి ఉన్నాయి. కంటితో రాబందు ఏడు మైళ్ళు ఎత్తుగా ఎగురుతున్నా తన ఉదరానికి కావలసిన ఆహారం ఎక్కడ ఉందో కనుక్కుంటుంది. అవునా?

**బాబ్ :** అవును.



**శ్రీల ప్రభుపాదులు :** కృష్ణు డంటే భగవంతు డని అర్థం.

**బాబ్ :** వారికి భగవత్ చైతన్యం తక్కువ కాని, వారు ఇతరుల నుంచి ఏమీ తీసుకోరు. అంత వరకు వారు నిజాయతీ గలవారే. ఇతరులతో నిష్కపటంగా ఉండడానికి ప్రయత్నిస్తారు. వారు...

**శ్రీల ప్రభుపాదులు :** ఇతరుల ధనాన్ని తీసుకోరు. కాని భగవంతుని నుంచి ధనాన్ని తీసుకుంటారు అవునా?

**బాబ్ :** మరి అలాంటి వారు పాక్షికంగా అయినా మంచి వాళ్ళు కారా?

**శ్రీల ప్రభుపాదులు :** కారు. భగవంతుడే సర్వజగదధిపతి అనే సిద్ధాంతాన్ని అంగీకరించినప్పుడు... ఇతరుల వస్తువులను... ఇతరుల వస్తువు అంటే మీ అభిప్రాయం ఏమిటి?

**బాబ్:** నేను ఎవరిని గురించి ఆలోచిస్తున్నానో అలాంటి వారు... వారు పేదవారు. వారికి ధనం, ఆహారం అవసరం. కాని...

**శ్రీల ప్రభుపాదులు :** ధనం ప్రతివాడికీ అవసరమే. ప్రతివాడికీ అది కావాలి. దరిద్రుడు కాని వాడెవడు? ఇక్కడ చాలా మంది పెద్ద మనుష్యులు కూర్చుని ఉన్నారు. వారిలో ఎవరికి ధనం అవసరం గాని, ఆహారం అవసరం గాని లేదు? మీకు కూడా ధనం అవసరమే. మరి ధనికులని దరిద్రులని భేదం దేనిని బట్టి నిర్ణయిస్తారు? ప్రతి వాడికీ ధనం కావాలి. ధనం, ఆహారం కావలసిన వాడు అనేదే దానికి మీ నిర్వచనం అయితే ప్రతి వాడికీ ధనం, ఆహారం కావాలి. కాబట్టి ప్రతివాడూ దరిద్రుడే.

**బాబ్ :** నిజమే కాని, నేనంటున్నది ఇతరులతో పోల్చి చూస్తే సాపేక్షంగా దరిద్రులుగా కనపడే వారిని గురించి.

**శ్రీల ప్రభుపాదులు :** సాపేక్షంగానా? సాపేక్షంగా కావచ్చును. మీకు నా కంటె ఎక్కువ ఆకలి వేస్తుంది. అంత మాత్రం చేత మీకే ఆకలి వేస్తుం దని గాని,నాకు అసలు ఆకలి వేయనే వేయదని గాని అర్థం కాదు. నాకు ఇప్పుడు ఆకలిగా లేదు.

అంటే నాకు ఆకలి అసలే ఉండదని అర్థం కాదు. అలాగే తాత్కాలికంగా మీకు ఆకలి లేక పోవచ్చును. రేపు మీకు ఆకలి వేస్తుంది.

**బాబ్** : నాకేమనిస్తూందంటే - నేను చెబుతున్న ఈ మనుష్యులు ఏ విధంగానైనా - ఒకవేళ వారి చుట్టూ ఉన్నవారు దొంగతనం చేస్తూ ఉండవచ్చునేమో కాని - వారు మాత్రం చిత్తశుద్ధికి కట్టుబడి దొంగిలించకుండా ఉంటారు. ఇలాంటి వారు కొంత మంచి జరుగడానికి అర్హులని నాకు అనిపిస్తుంది.

**శ్రీల ప్రభుపాదులు** : తానేదీ దొంగిలించడం లేదని భావించే వాడు కూడా, సర్వం కృష్ణునిదే అని ఎరుగడు కాబట్టి దొంగే అవుతాడు. కనుక వాడేది తీసుకున్నా దొంగిలించడమే.

**బాబ్** : అతడు కొంచెం తక్కువ దొంగ కదా?

**శ్రీల ప్రభుపాదులు** : ఈ శాలువా నాది అని మీకు తెలియక పోవచ్చును. కాని, మీరు దీనిని తీసికొని పోతే, అది దొంగతనం కాదా?

**బాబ్** : కావచ్చును. కాని, ఇది మీది అని తెలిసి కూడా తీసుకుంటే, తెలియక తీసికొని పోయిన వానికంటే ఎక్కువ దొంగను అవుతాను కదా? అది ఎవరిదీ కాదని అనుకొని తీసికొంటాను.

**శ్రీల ప్రభుపాదులు** : అది కూడా దొంగతనమే. ఎందుచేతనంటే అది ఎవరిదో ఒకరిది అయి ఉండాలి. దానిని వారి అనుమతి లేకుండా మీరు తీసికొన్నారు. దాని యజమాని ఎవరో యథార్థంగా మీకు తెలియకపోవచ్చును. కాని "అది ఎవరిదో ఒకరిది అయి ఉండాలి" అని తెలుసును కదా? అది జ్ఞానం. కొన్ని సమయాలలో మనకు బాటలలో విలువ గల వస్తువులు, ఎవరో వదలి వెళ్ళినవి కనిపిస్తాయి - అవి ఆ బాటలను బాగు చేయడానికి ఉద్దేశించిన ప్రభుత్వ సామగ్రి గాని, ఏవైనా విద్యుత్ పరికరాలు గాని అయి ఉండవచ్చును. "ఓహో! అదృష్టవశాత్తు ఈ వస్తువు లిక్కడ పడి ఉన్నాయి. నేను వీటిని పట్టుకు పోతాను" అని ఎవరైనా అనుకుంటే అది దొంగతనం కాదా?



**బాబ్** : అది దొంగతనమే.

**శ్రీల ప్రభుపాదులు** : సరే, అవన్నీ ప్రభుత్వానికి చెందిన వని అతనికి తెలియక తీసుకుని పోతాడు. అది దొంగతనం. పట్టుబడితే బంధించి శిక్షిస్తారు. అలాగే మీరు ఏమి దొంగిలించినా - మీరు నదిలోని నీరు త్రాగారనుకోండి. నదీ జలం మీదా?

**బాబ్** : కాదు.

**శ్రీల ప్రభుపాదులు** : అందుకే అది దొంగతనం. నదిని మీరు సృష్టించలేదు. దాని యజమాని ఎవరో మీకు తెలియదు. అది మీది కాదు. కాబట్టి అందులోని నీరు మీరు ఒక చిన్న పాత్రతో త్రాగినా మీరు దొంగే. కాని మీరు నిర్దోషిని అనుకుంటారు. వాస్తవానికి మీరు దొంగ. మీరు కృష్ణుణ్ణి ఎల్లప్పుడూ స్మరించాలి. "ఓ కృష్ణా! ఇది నువ్వు సృష్టించింది కాబట్టి దయ చేసి దీనిని తాగనివ్వు." అదీ నిజాయితీ అంటే. కాబట్టి కృష్ణ చైతన్యం లేని ప్రతివాడూ నీచుడూ, దుర్మార్గుడూ, బందిపోటు దొంగే! సారాంశం ఏమిటంటే, కృష్ణుణ్ణి తెలియని వాడికి సద్గుణాలు ఉండవు. నిజాయితీ గాని, జ్ఞానం గాని లేనివాడు కాబట్టి వాడు మూడవ తరగతి వాడు. సరేనా? నీ అభిప్రాయం ఏమిటి గిరిరాజా?

**గిరిరాజ దాస్** [ఒక శిష్యుడు] : అవును.

**శ్రీల ప్రభుపాదులు** : ఇదేమీ మొండివాదం కాదు. నిజం. [కొంచెం సేపు పోయాక.] కాబట్టి జ్ఞానం అంటే ఏమిటో, నిజాయితీ అంటే ఏమిటో మీకు అర్థమయిం దన్నమాట!

**బాబ్** : ఒక రకంగా, ఒక రకంగా.

**శ్రీల ప్రభుపాదులు** : మరో రకం కూడా ఉందా? [బాబ్ నవ్వుతాడు.] మరో మార్గం ఉందా? దీనిని కాదంటారా? [బాబ్ మళ్ళీ నవ్వుతాడు. శ్రీల ప్రభుపాదులు కూడా నవ్వుతారు.] మరో రకంగా ఉందా? గిరిరాజా!

**గిరిరాజ దాస్** : లేదు.

**శ్రీల ప్రభుపాదులు** : దీనికి బదులు మరొకటి ఉందా? ఎవరైనా ఖండించ గలిగిన దానిని మనం చెప్పడం లేదు. ఆ అనుభవం మనకు ఉంది. అంటే, మనం ప్రతివారినీ ఎదిరిస్తాము. "ప్రశ్నలేమైనా ఉన్నాయా?" అని అడుగుతాము. ఇంతవరకు కృష్ణుడు మనను రక్షించాడు. పెద్ద పెద్ద నగరాలలో పెద్ద పెద్ద సభలలో, నా ఉపన్యాసం అయ్యాక "ప్రశ్నలేమైనా ఉన్నాయా?"అని అడుగుతాను.

**బాబ్** : ఇప్పుడు నాకు ఏ ప్రశ్నా లేదు.

**శ్రీల ప్రభుపాదులు** : లండన్‌లో అక్కడ ఎన్ని రోజులు ఉపన్యాసాలిచ్చాను? ఏమిటి ఆ సభాస్థలం పేరు? 'కాన్వే హాల్'.

**ఒక శిష్యుడు** : పన్నెండు రోజులు. అది 'కాన్వే హాల్'.

**శ్రీల ప్రభుపాదులు** : అవును. అక్కడ ప్రతి రోజూ సభ అయిపోగానే "ప్రశ్నలేమైనా ఉన్నాయా?" అని అడిగేవాణ్ణి?

**బాబ్** : చాలా ప్రశ్నలు వేసేవారా?

**శ్రీల ప్రభుపాదులు** : ఓ! వేసేవారు. చాలా మూఢత్వపు ప్రశ్నలు. [అందరు నవ్వుతారు.]

**బాబ్** : నేను మరో ప్రశ్న వేస్తాను. మూఢత్వం అంటే ఏమిటి?

**శ్రీల ప్రభుపాదులు** : జ్ఞానం లేకపోవడమే మూఢత్వం.

**భారతీయ భక్తుడు** : ప్రభుపాదుల వారూ! నేను ఒక వ్యక్తిగతమైన ప్రశ్న అడగా లనుకుంటున్నాను. అడుగనా?

**శ్రీల ప్రభుపాదులు** : అడగండి.

**భారతీయ భక్తుడు** : కొంత కాలం క్రితం కలకత్తాలో ఒక సప్తాహం జరిగింది. దానికి 'ప్రాణుల యెడ క్రూరత్వ నివారణ సప్తాహం' అని పేరు పెట్టారు.

**శ్రీల ప్రభుపాదులు** : [ఆయన వెంటనే నవ్వి.] ఇది మరొక మూఢత్వం. వారు క్రూరత్వ నివారణకు ప్రకటనలు ఇస్తున్నారు. కొన్ని వేల కబేలాలను వారు నడుపుతున్నారు. అది మరొక మూఢత్వం.



**శ్రీల ప్రభుపాదులు** : తరువాత దాని రెక్కలు అక్కడికి దానిని చేరుస్తాయి. దవడలు ఆ ఆహారాన్ని పట్టుకుంటాయి. శరీరంలో పొట్ట 'భోక్త' అయినట్లు ఈ సమస్త ప్రత్యక్ష ప్రపంచమూ అది భౌతికం కాని, ఆధ్యాత్మికం గాని దానికి కృష్ణ భగవానుడే 'భోక్త'. మన శరీరాలను గురించి ఆలోచిస్తే మనకు తెలుస్తుంది. మీరు ఎక్కడికి వెళ్ళినా పశువులలో కూడా ఒకే విధమైన యాంత్రిక స్వభావం కనిపిస్తుంది. మానవ శరీరంలోను, ప్రపంచంలోనూ ఇంచుమించు అదే యాంత్రిక స్వభావం ఉంది. అందుచేత ఈ శరీరంలో నా శరీరంలోనూ, మీ శరీరంలోనూ ఉదరము 'భోక్త' అని సులభంగా అర్థం చేసికోగలము. అన్నిటి మధ్య ఒక 'భోక్త' ఉన్నాడు. ఉదరము మనకు మిత్రుడు కూడా. ఎందుకంటే మనం అన్నాన్ని జీర్ణం చేసుకోలేక పోతే ఇతర అవయవా లన్నీ నీరసిస్తాయి. కాబట్టి ఉదరం మిత్రుడు. అది ఆహారాన్ని జీర్ణం చేసి శరీరంలోని అన్ని అవయవాలకూ శక్తిని పంపిస్తుంది. అవునా?

**బాబ్** : అవును.

**శ్రీల ప్రభుపాదులు** : అదే విధంగా సర్వ సృష్టికీ మధ్యగా ఉన్న ఉదరం భగవంతుడు - కృష్ణుడు. అతడు 'భోక్త'. అతడు మిత్రుడు. అతడు సర్వ భూత మహేశ్వరుడు. అతడు అందరినీ పోషిస్తున్నాడు, రాజు సర్వానికీ అధిపతి కాబట్టి దేశంలోని సమస్త ప్రజలను పోషించేటట్లు సర్వాధిపతి కాకపోతే సర్వమిత్రుడు ఎలా అవుతాడు? అందుచేత ఈ విషయాలను తెలుసుకోవాలి. మీరీ మూడు విషయాలనూ తెలిసికొన్నప్పుడు మీ జ్ఞానం సంపూర్ణం అవుతుంది. మీకు ఇంక ఏమీ తెలిసికోవలసిన అవసరం ఉండదు.

యస్మిన్ విజ్ఞాతే సర్వ మేవం విజ్ఞాతం భవతి

మీరీ మూడు సూత్రాలతో కృష్ణుణ్ణి తెలిసికుంటే మీ జ్ఞానం సంపూర్ణం అవుతుంది. అంతకన్న ఎక్కువ జ్ఞానం మీకు అనవసరం. అయితే జనం అంగీకరించరు.

"కృష్ణుడే ఎందుకు సర్వజగత్పతి కావాలి? హిట్లరు ఎందుకు కాదు? నిక్సన్..." ఇలా అంటున్నారు. కాబట్టి మీకు చిక్కు వస్తుంది. కాని, మీరీ మూడు విషయాలూ తెలుసుకుంటే, మీ జ్ఞానం సంపూర్ణం అవుతుంది. కాని మీరు అంగీకరించరు - ఈ మూడు విషయాలనూ గ్రహించడానికి మీ రేవేవో అభ్యంతరాలు చెప్తారు. అదే మీ అనర్థాలకు మూలం. భగవద్గీత (5.29)లో స్పష్టంగా చెప్పబడింది:

భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోక మహేశ్వరమ్
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి

"నా సంపూర్ణ చైతన్యంలో ఉన్న వాడు నన్ను అన్ని యజ్ఞాల, తపోనియమాల భోక్తగానూ, అన్ని లోకాలకు, ఉప దేవతలకూ పరమ ప్రభువుగానూ, సర్వ జీవుల యొక్క శ్రేయో భిలాషిగానూ తెలిసికొని భౌతిక దుఃఖాల బాధ నుంచి శాంతిని పొందుతాడు." కాని మనం దీనిని అంగీకరించము. అనేక అబద్ధ స్వాములనూ, అబద్ధ మిత్రులనూ, అబద్ధభోక్తలనూ అంగీకరిస్తాము. వాళ్ళు తమలో తాము పోరాడుకుంటారు. ఇదీ ప్రపంచ స్థితి. సరియైన విద్యాభ్యాసం జరిగి ప్రజ లంతా ఈ జ్ఞానాన్ని గ్రహిస్తే వెంటనే శాంతి ఏర్పడుతుంది (శాంతి మృచ్ఛతి). అదీ జ్ఞానం. దానిని అనుసరించే వాడు సరియైన ప్రవర్తన కలవాడు. అతడు దేనినైనా "ఇది నాది" అనడు. అతనికి అన్నీ తెలుస్తాయి. "ఓహో! ఇది కృష్ణునిది కాబట్టి ప్రతి వస్తువునూ కృష్ణ సేవకే వినియోగించాలి" అంటాడు. అదీ నిజాయతీ గల ప్రవర్తన అంటే. ఈ పెన్సిలు నాది అయినప్పుడు మర్యాద ఏమిటంటే - నా శిష్యులు కొన్ని సమయాలలో నన్ను అడుగుతారు : "నేను ఈ పెన్సిలును ఉపయోగించ వచ్చునా?" అని. "సరే, ఉపయోగించవచ్చును" అని నేను అంటాను. అదే విధంగా,సమస్తం కృష్ణుడికి చెందినదే అని నాకు తెలిసినప్పుడు, అతని అనుమతి లేకుండా నేను ఏదీ ఉపయోగించను. అది నిజాయితీ, అది



జ్ఞానము. అది తెలియని వాడు అజ్ఞాని, మూఢుడు. మూఢుడు నేరాలు చేస్తాడు. నేరస్థు లందరూ మూఢులే. అజ్ఞానం వల్లనే శాసనాన్ని ఉల్లంఘిస్తారు. కాబట్టి అజ్ఞానం ఆనందం కాదు. అదే వచ్చిన చిక్కు. సమస్త ప్రపంచమూ అజ్ఞానంలో సుఖిస్తుంది. కాబట్టి, కృష్ణ చైతన్యం గురించి మీరు మాట్లాడితే వారికి నచ్చదు. "సర్వమూ కృష్ణుని ధనమే. మీ ధనం ఏదీ లేదు" అని నేను అంటే మీకు సంతృప్తి కలుగదు. [వారు నవ్వుతారు.] చూడండి, అజ్ఞానమే ఆనందం కాబట్టి యథార్థం చెప్పడం నా మూఢత్వం. అజ్ఞానం ఆనందమైనప్పుడు వివేకవంతుడుగా ఉండడం మూఢత్వం. కాబట్టి జనులకు కోపం తెప్పించడానికి మేము సాహసిస్తున్నాము. వారు మమ్ములను చూచి మూఢులు అని అనుకుంటారు. ఒక ధనవంతుడితో: "నీ ధనానికి నీవు కాదు యజమానివి. కృష్ణుడు యజమాని. కాబట్టి నీ ధనాన్నంతటినీ కృష్ణుడి కోసం ఖర్చు పెట్టు" అని నేను అంటే అతనికి కోపం వస్తుంది.

ఉపదేశో హి మూర్ఖానాం ప్రకోపాయ న శాంతయే

"మీరు నీచుడికి ఉపదేశిస్తే వాడికి కోపం వస్తుంది." కాబట్టి మేము బిచ్చగాళ్ళలాగ వారిని సమీపిస్తాము: "బాబుగారూ, మీరు చాలా మంచివారు. నేను ఒక సన్న్యాసిని, భిక్షువును. నేను ఒక దేవళం నిర్మించాలనుకుంటున్నాను. కొంచెం ధనం దానం చేయగలరా?" అని అడుగుతాము. అప్పుడు అతడు : "ఓహో! వీడు ఒక బిచ్చగాడు. వీడికి కొంత డబ్బిచ్చి పంపండి" అంటాడు. [వారు నవ్వుతారు.] అలా కాక, "అయ్యగారూ, మీకు లక్షల కొలది ధనం ఉంది. అది కృష్ణుని ధనం. దానిని నాకు ఇవ్వండి. నేను కృష్ణుడి సేవకుడను" అనిఅన్నా ననుకోండి. [అందరూ నవ్వుతారు.] అతనికి ఎంత మాత్రం ఇష్టం ఉండదు. అంతకంటె, నేను బిచ్చగాడిలాగ సమీపిస్తే అతడు కొంత ఇస్తాడు. నిజం చెబితే ఒక్క పైసా కూడా ఇవ్వడు. [వారు నవ్వుతారు.] మనం బిచ్చగాళ్ళలాగ అతనికి

నచ్చచెప్పాలి. నిజానికి మనం యాచకులము కాము. కృష్ణుని దాసులము. మనకు ఎవరి వద్ద నుంచీ ఏమీ అవసరం లేదు. ఎందువల్లనంటే కృష్ణుడు సమస్తమూ ఇస్తా డని మనకు తెలుసును.

**బాబ్** : అవును.

**శ్రీల ప్రభుపాదులు** : ఇది జ్ఞానం. ఉదాహరణకు : ఒక్కొక్కప్పుడు ముఖ్యమైన పత్రాలు ఒక బాలుని చేతికి చిక్కుతాయి. అప్పుడు మనం ఆ బాలుని పొగడవలసి వస్తుంది. "ఓహో! నీవు చాలా మంచివాడివి. ఈ చాక్‌లెట్‌లు తీసుకుని ఆ కాగితాలు నాకివ్వు. అవి ఎందుకూ పనికిరావు. వట్టి కాగితాలు మాత్రమే" అంటాము. అప్పుడు ఆ బాలుడు "అవును. వీటిని తీసుకోండి. అవే బాగున్నాయి" అంటాడు. రెండు పైసల చాక్‌లెట్‌లు చాలా తియ్యగా ఉంటాయి. అందుకే మనం అలాంటి పని చేయవలసి ఉంది. ఎందుకు? కృష్ణుని ధనం తీసికొన్నవాడు నరకానికి వెళుతాడు కాబట్టి. అందుచేత ఏ విధంగా నైనా అతని నుంచి ధనం తీసికొని అతనిని కృష్ణచైతన్యోద్యమంలో పాల్గొనేటట్లు చేయవచ్చును.

**బాబ్** : అలా అయితే అతడు నరకానికి వెళ్ళడా?

**శ్రీల ప్రభుపాదులు** : వెళ్ళడు. నరకానికి వెళ్ళకుండా మీరు అతనిని రక్షించారు. ఎందుచేతనంటే కృష్ణుని కోసం ఖర్చు పెట్టబడిన ప్రతిపైసా లెక్కలోకి వస్తుంది : "ఓహో! ఇతడొక పైసా ఇచ్చాడు" అని. దీనిని "అజ్ఞాత సుకృతం" అంటారు (తనకు తెలియకుండానే చేసే ఆధ్యాత్మిక కార్యం). వారు ఆలోచించలేరు కాబట్టి సాధువులు వారికి జ్ఞానోదయం కలిగించడానికి ప్రయత్నిస్తారు. వారికి కృష్ణుణ్ణి సేవించడానికి ఒక అవకాశం ఇవ్వడానికి ప్రయత్నిస్తారు. అది సాధువు కర్తవ్యం. అలా కాక ఇతరుల వద్ద ధనం తీసికొని తన విషయ సుఖాల కోసం వినియోగిస్తే నరకానికి వెళుతాడు. దానితో అది సమాప్త మవుతుంది. అటువంటి వాడు మోసగాడు, నిజంగా దోషి. మీరు ఎవరి నుంచైనా ఒక పైసా అయినా తీసికొని మీ విషయ భోగాలకు ఉపయోగించరాదు.

**బాబ్** : కృష్ణ చైతన్యం పొందని నా పరిచితులు కొందరి సంగతి ఆలోచిస్తున్నాను.



**భారతీయ భక్తుడు** : కాబట్టి నేను మిమ్మల్ని అడగాల నుకున్నది -

**శ్రీల ప్రభుపాదులు** : మీరు అడుగక ముందే దానికి సమాధానం ఇస్తున్నాను. [అందరూ నవ్వుతారు.] అది మరొక మూఢత్వం. వారు నిరంతరం ప్రాణహింస చేస్తూనే ఉన్నారు. కాని ఒక సంఘాన్ని స్థాపించుకున్నారు. అంటే అది ఒక దొంగల గుంపు. 'గుడ్‌మాన్ అండ్ కంపెనీ' అని ఒక బల్ల కట్టి ఉందనుకోండి. ఒక్కొక్కసారి మీకు అలాంటి బల్ల కనిపిస్తూ ఉంటుంది.

**శ్యామసుందర దాస్** : సాన్ ఫ్రాన్సిస్కోలో మన దేవాలయం ఉన్న ఇంటి యజమాని పేరు 'గుడ్‌మాన్' [మంచివాడు అని అర్థం].

**శ్రీల ప్రభుపాదులు** : వారి వాదం ఏమిటంటే, ఏ జంతువునైనా సరిగా పోషించలేక పోవడం క్రూరత్వం. కాబట్టి ఆకలితో దానిని మాడ్చడం కంటె దానిని ఒక్కసారే చంపివేయడం మంచిదని. అదే వారి వాదం. అవునా?

**బాబ్** : అవును.

**శ్రీల ప్రభుపాదులు** : దానిని అంత బాధ పెట్టడం కంటె చంపడం మంచిది అని వారు వాదిస్తారు. ఈ వాదం కమ్యూనిస్టు దేశాలలో కనిపిస్తుంది. ఒక వృద్ధుడు బాధపడుతున్నాడు. కాబట్టి అతనిని చంపడం మంచిది. ఇక ఆఫ్రికాలో అయితే ఒక వర్గం వారు తమ ముత్తాతలను చంపి పండుగ చేసుకుంటారట, అవునా?

**శ్యామసుందర దాస్** : వారిని తినివేస్తారా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. [శ్యామసుందర్ నవ్వుతాడు.]

**ఒక శిష్యుడు** : నా మేనమామ, మేనత్త ఉన్నారు. వారు సైన్యంలో ఉన్నారు. వారు విదేశాలకు వెళ్ళేటప్పుడు తమ కుక్కను తమ వెంట తీసికొని వెళ్ళలేక పోయారు. "అయ్యో పాపం! ఈ కుక్క మేము లేకపోతే గుండె పగిలి చస్తుంది" అని భావించి దానిని చంపివేశారు.

**శ్రీల ప్రభుపాదులు** : గాంధీ జీవితంలో కూడా అతడు ఒక దూడనో ఆవునో చంపించేశాడు. అది చాలా బాధపడుతూందట. అందుకు "దానిని ఆ విధంగా బాధపడనివ్వడానికి బదులు చంపివేయండి" అని గాంధీ ఆజ్ఞాపించాడట.

**గిరిరాజ దాస్** : నిన్న మీరు, ఆధ్యాత్మిక గురువు తన శిష్యుల పాప కార్యాలకు బాధ పడవలసి వస్తుందని అన్నారు. పాప కార్యాలు అనే మాటకు మీరు చెప్పే అర్థం ఏమిటి?

**శ్రీల ప్రభుపాదులు** : పాప కార్యాలు అంటే : మీరు "మీరు ఉపదేశించిన సిద్ధాంతాలను నేను అనుసరిస్తాను" అని ప్రతిజ్ఞ చేసి వాటిని అతిక్రమించా రనుకోండి. అది పాప కార్యం. ప్రతిజ్ఞ చేయడం చాలా సులభం. మీరు ప్రతిజ్ఞను భగ్నం చేసి చెడు పనులు చేస్తారు. అందుచేత మీరు పాపాత్ములు అవుతున్నారు.

**గిరిరాజ దాస్** : ఔను. [కొంచెం సేపు గడిచాక.] అయితే కొన్ని కొన్ని పనులున్నాయి. వాటిని చేయాలని మాకు ఆదేశా లున్నాయి...

**శ్రీల ప్రభుపాదులు** : ఊఁ.

**గిరిరాజ దాస్** : కాని మేము వాటిని చేయడానికి ప్రయత్నించినా సరిగా చేయలేక పోతున్నాము.

**శ్రీల ప్రభుపాదులు** : అదెలాగ? మీరు చేయడానికి ప్రయత్నించినా చేయలేక పోవడమా? అదెలాగ?

**గిరిరాజ దాస్** : ఏకాగ్రచిత్తంతో జపం చేయడం. కొన్ని సార్లు ఎంత ప్రయత్నించినా...

**శ్రీల ప్రభుపాదులు** : అదా? అది ఒక తప్పు కాదు. ఒక పని చేయడానికి మీరు ప్రయత్నించా రనుకోండి. అనుభవం లేకపోవడం వల్ల ఒక్కొక్కసారి మీరు దానిని చేయలేకపోవచ్చును, అది తప్పు కాదు. మీరు ప్రయత్నమయితే చేస్తున్నారు. భాగవతంలో ఒక శ్లోకం ఉంది. ఒక భక్తుడు శక్తి కొద్దీ ప్రయత్నిస్తాడు. కాని, అసమర్థత వల్ల ఒక్కొక్కప్పుడు విఫలుడవుతాడు. కృష్ణుడు అటువంటి వాడిని క్షమిస్తాడు. భగవద్గీత (9.30)లో కూడా దానిని గురించి ఇలా ఉంది:

అపి చే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్

ఒక్కొక్కసారి, బుద్ధి పూర్వకంగా కాక పూర్వపు దురలవాటు వలన ఎవడైనా తుచ్ఛమైన పనిని చేయవచ్చును. కాని, వాడు పాపం చేశాడని అర్థం కాదు.



అయితే వాడు ఆ పని చేసినందుకు పశ్చాత్తాపం పొందాలి - "ఈ పొరపాటు నేను చేశానే" అని దానిని మళ్ళీ చేయకుండా ఉండడానికి చేతనైనంత వరకు ప్రయత్నించాలి. కాని, అలవాటు బలీయమైంది. కనుక కొన్ని సమయాలలో మీరు ఎంత ప్రయత్నించినా, మాయా ప్రభావం ప్రబలమై మిమ్మల్ని గోతిలో పడవేస్తుంది. అది క్షమించదగినది. కృష్ణుడు క్షమిస్తాడు. కాని బుద్ధి పూర్వకంగా తప్పు చేసేవారు క్షమించ బడరు. నేను భక్తుణ్ణి గదా అనే గర్వంతో : "నే జపం చేస్తున్నాను కాబట్టి. ఏ పాపమైనా చేయవచ్చును. అది రద్దయిపోతుందిలే!" అని అనుకుంటే అది మహా అపరాధం.

# 8. కృష్ణ చైతన్య మార్గంలో పురోగతి

**(బాబ్, శ్రీల ప్రభుపాదుల మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు)**

స్ప్రింగ్‌ఫీల్డ్, న్యూ జర్సీ
జూన్ 12, 1972

ప్రియమైన ప్రభుపాదుల వారికి,

సవినయంగా నమస్కారాలు సమర్పించుకుంటున్నాను. న్యూయార్క్‌లో ఉన్న ఇస్కాన్ దేవాలయంలోని శిష్యులను కలసి కొంటున్నాను. అటువంటి ఉన్నత స్థాయి భక్తుల సహవాసం వలన కృష్ణ చైతన్యంలో కొంత ముందడుగు వేయగలనని ఆశిస్తున్నాను. నా కాబోయే భార్య కృష్ణ మందిరానికి రావడం ప్రారంభించింది. సంకీర్తనం చేయడం మొదలు పెట్టింది. నేను భారతదేశం నుండి ఆమెకు వ్రాసే వరకు ఆమెకు కృష్ణ చైతన్యం గురించి ఏమీ తెలియదు. ఆదర్శ గృహస్థ జీవితాన్ని మేము చూచేందుకుగాను ఆత్రేయ ఋషి దయతో మమ్ములను తమ ఇంటికి ఆహ్వానించాడు.

శాంతి సైన్యం (అమెరికన్ పీస్ కోర్) నుంచి విరమించుకోడానికి ఏప్రిల్ నెలాఖరున నేను బొంబాయి వెళ్ళాను. అదృష్టవశాత్తు నాకు ఆట్టే జబ్బుచేయలేదు. అయినా బొంబాయిలో రెండు వారాలు ఉండిపోవలసి వచ్చింది. ఆ సమయాన్ని నేను చాలా పురోగమించిన కృష్ణభక్తులతో జుహూలో గడిపాను. దురదృష్టవశాత్తు అంతకు అయిదు దినముల ముందే మీరు అక్కడి నుంచి వెళ్ళారని తెలిసింది.

నాకు తెలిసినది కొంచెమే అయినా కృష్ణ చైతన్య విధానంలో విశ్వాసం కుదిరింది. దానిని అంతకంతకు ఎక్కువగా అభ్యాసం చేయాలని ఆశిస్తున్నాను.

ఆత్రేయ ఋషి నుంచి లాస్ ఏంజెలస్‌లోని మందిరం వర్ణన కోసం ఎదురు చూస్తూ, న్యూయార్క్‌లో మిమ్మల్ని స్వయంగా కలుసుకోగలనని ఆశపడుతున్నాను.



ఎంతో అనర్హుడైన ఈ యువకుని పట్ల మీరు చూపించిన దయకు కృతజ్ఞుడను.

మీ విశ్వాసపాత్రుడు,
**బాబ్ కోహెన్**

★ ★ ★

ఏ.సి.భక్తివేదాంత స్వామి
ఇస్కాన్, లాస్ ఏంజెలస్
జూన్ 16, 1972

బాబ్ కోహెన్
స్ప్రింగ్‌ఫీల్డ్, న్యూ జెర్సీ

ప్రియమైన బాబ్‌కు,

దయ చేసి నా ఆశీర్వచనాలను స్వీకరించండి. 1972 జూన్ 12వ తేదీ నాటి మీ ఉత్తరానికి నేను చాలా కృతజ్ఞుణ్ణి. అందులో మీరు వెలిబుచ్చిన మీ అభిప్రాయాలను నేను గమనించాను. మాతో చేరుతున్నారని వినడం నాకు చాలా ఆనందం కలిగిస్తూంది. మీరు చాలా మంచి యువకులనీ, తెలివి గలవారనీ నాకు తెలుసును. మీరు సాధుస్వభావులు. కాబట్టి కృష్ణుడు అతిశీఘ్రంగా తన సమస్త అనుగ్రహాలనూ మీపైన వర్షిస్తాడని నాకు పూర్తిగా నమ్మకం ఉంది. తద్వారా మీరు కృష్ణ చైతన్యంలో సంపూర్ణ సౌఖ్యాన్ని స్వయంగా చవి చూస్తారు. 'మాయ' పట్ల, అంటే భౌతిక భోగాల పట్ల ఆసక్తిని స్వచ్ఛందంగా త్యాగం చేసిన వాడు కృష్ణ చైతన్యంలో పురోగమించ గలడు. అటువంటి త్యాగాన్ని 'తపస్య' అంటారు. అయితే, తగినంత కారణం లేకుండా మనం తపస్సు చేయడానికి ఇష్ట పడము. కాబట్టి మీ వంటి శాస్త్రీయమైన, తాత్త్వికమైన మనస్సు ఉన్న వారెవరైనా భౌతికాతీత జ్ఞానం అంటే ఏమిటో మొదట గ్రహించాలి. మీరు జ్ఞానం సంపాదిస్తే తపస్సు దానంతట అదే వస్తుంది. అప్పుడు మీరు ఆధ్యాత్మిక జీవితంలో

అభివృద్ధి సాధిస్తారు. కాబట్టి జీవితంలో సంపూర్ణత్వం పొందాలని ఆశించేవారికి ఎవరికైనా జ్ఞాన సంపాదన ప్రథమ కర్తవ్యం. అందుచేత మీరు సాధ్యమైనంత వరకూ మా పుస్తకాలను ప్రతి రోజూ చదివి, వాటిలోని విషయాలను వివిధ దృక్కోణాల నుంచి అర్థం చేసుకోడానికి న్యూయార్క్ దేవాలయంలోని భక్తులతో తరచు చర్చిస్తూ ఉండండి. మీకు తత్త్వం క్రమంగా బోధ పడగలదు. తరువాత మీ భక్తియుత సేవ వలన మీరు పురోగమించగలరు.

నాయందును, ఈ కృష్ణ చైతన్య విధానంలోను కొంత విశ్వాసం ఏర్పడడం నిజమైన జ్ఞానం పొందడానికి మొదటి మెట్టు. శ్రద్ధ ఉంటే జ్ఞానం లభిస్తుంది. మీ జ్ఞానం పెరుగుతూ ఉంటే దానితో పాటు మాయాశక్తి పట్ల మీకు విరక్తి కూడా పెరుగుతుంది. మీరు స్వయంగానే మీ భౌతిక బంధాలను విడనాడుతారు. అప్పుడు మీకు తప్పకుండా పురోగతి సిద్ధిస్తుంది.

మాయాపూర్‌లో మన మధ్య జరిగిన సంభాషణల టేపులను ఇప్పుడు టైపు చేస్తున్నారు. తరువాత వాటిని ఒక పుస్తకంగా ప్రచురిస్తాము. దానికి 'ఉత్తమ ప్రశ్నలు - ఉత్తమ సమాధానాలు' అని పేరు పెడుతాము. అవి పంపిణీకి సిద్ధం కాగానే ఒక ప్రతి మీకు పంపిస్తాము. ఈలోగా లండన్‌లో జరిగే రథ యాత్రోత్సవానికి వెళుతూ నేను మార్గ మధ్యంలో రెండు మూడు రోజులు న్యూయార్క్‌లో ఆగుతాను. నేను న్యూయార్క్ ఎప్పుడు చేరుతానో సరిగా చెప్పలేను. కాని జూలై మొదటి వారంలో అక్కడికి చేరుతానేమో? నేను వచ్చే తేదీ గురించి మీరు బలిమర్దనుని అడిగి తెలుసుకోవచ్చును. మిమ్ములను న్యూయార్క్‌లో మళ్లీ కలుసుకోడం నాకు ఎంతో ఆనందదాయకం. మీరు అడుగవలసిన ప్రశ్న లింకా ఉంటే మనం చర్చించుకుందాము.

మీరు ఆరోగ్యంగానూ, ఆనందంగానూ ఉంటారని ఆశిస్తూ,

మీ నిరంతర శ్రేయోభిలాషి,

**ఏ.సి. భక్తివేదాంత స్వామి**

# 9. తరువాతి జన్మను నిర్ణయించుకోవడం

## న్యూయార్క్,జూలై 4, 1972

**బాబ్** : మీరు దయతో వ్రాసిన ఉత్తరం అందింది.

**శ్రీల ప్రభుపాదులు** : మంచిది.

**బాబ్** : సుమారు ఒక వారం క్రిందట.

**శ్రీల ప్రభుపాదులు** : సరే. మీరు బుద్ధిమంతులైన యువకులు. ఈ తత్త్వాన్ని అర్థం చేసుకోడానికి మీరు ప్రయత్నించవచ్చును. ఇది చాలా ముఖ్యం. ఇంద్రియ తృప్తి కోసం జనం ఎంతో శక్తిని వ్యర్థం చేస్తున్నారు. వచ్చే జన్మలో ఏం జరుగబోతూందో వారు ఆలోచించడం లేదు. పునర్జన్మ అనేది ఉంది. కాని, జనం అజ్ఞానులు. ఈ జన్మ పునర్జన్మ కోసం చేసే ప్రయత్నం. అది వారికి తెలియదు. ఆధునిక విద్యా విధానానికి, దానిని అనుసరించే విశ్వ విద్యాలయాలకు ఈ సరళమైన జ్ఞానం గురించి ఏ మాత్రం తెలియదు. మనం అనుక్షణం శరీరాలను మారుస్తున్నాము. ఇది వైద్య రీత్యా కూడా నిజం. మనం ఈ శరీరం విడిచిన తరువాత మరొక శరీరాన్ని పొందవలసి వస్తుంది. ఆ శరీరాన్ని ఎలా స్వీకరించబోతున్నాము? ఎటువంటి శరీరం మనకు వస్తుంది? అది కూడా తెలుస్తుంది. ఉదాహరణకు: విద్యార్జన చేస్తున్న ఒక వ్యక్తి పరీక్షలలో ఉత్తీర్ణుడైనప్పుడు అతడు ఇంజనీరు అవుతాడో వైద్యవృత్తిని అవలంబిస్తాడో మనం ఊహించుకో గలం. అలాగే, ఈ జన్మలో ఎటువంటి పునర్జన్మ కావాలో నిర్ణయించుకుని దాని కోసం మీరు ప్రయత్నించవచ్చును.

**బార్బరా** [బాబ్ భార్య] : పునర్జన్మ ఎటువంటిది కావాలో మనం ముందుగా నిశ్చయించుకో గలమా?

**శ్రీల ప్రభుపాదులు** : తప్పకుండా! పునర్జన్మలో కృష్ణుణ్ణి చేరాలని మేము

నిశ్చయించుకున్నాము. అది మా నిశ్చయం. ఇంటికి తిరిగి వెళ్ళడం అంటే భగవంతుని వద్దకు చేరడం అని. మీరు విద్యావంతులు కావాలని నిశ్చయించుకున్నా రనుకోండి. ఆ నిశ్చయం చేసుకున్నాక ఇంజనీరు అవడానికో, వైద్య వృత్తిలో చేరడానికో నిశ్చయించుకుని దానికై ప్రయత్నం చేసి చదువుకుంటారు. అలాగే పునర్జన్మ ఎలాంటిది కావాలో మీ రిప్పుడు నిశ్చయించుకుంటారు. లేకపోతే, భౌతిక ప్రకృతే దానిని నిర్ణయించ గలదు.

**బార్బరా** : నేను నా పూర్వజన్మలో కృష్ణ చైతన్యం కలిగిన దాననా?

**శ్రీల ప్రభుపాదులు** : అది అంత ముఖ్యం కాదు. కాని, ఈ జన్మలో మీరు కాగలరు. మా కృష్ణ చైతన్యోద్యమం సహాయం తీసుకోండి.

**ఒక శిష్యుడు** : ఆమె అడుగుతున్న దేమిటంటే పూర్వజన్మలో తాను కృష్ణుని భక్తురాలై ఉండి, మళ్ళీ కృష్ణ భక్తి కోసమే ఈ జన్మను పొందడం సంభవించిందా? అని.

**శ్రీల ప్రభుపాదులు** : ఎవరైనా విశుద్ధ కృష్ణ భక్తుడైతే మళ్ళీ జన్మించడు. అతని భక్తిలో కొంచెం లోపం ఉంటే మళ్ళీ జన్మించే అవకాశం ఉంటుంది. అయితే కొంచెం లోపం ఉన్నా వాడు మంచి కుటుంబంలో జన్మిస్తాడు. "శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టో ఽభిజాయతే" - "ఉత్తీర్ణుడు కాని వ్యక్తి పవిత్రుల కుటుంబంలో గాని సంపన్నుల కుటుంబంలో గాని జన్మిస్తాడు." (భ.గీ.6.41) మానవుని వివేకం భవిష్యత్తును నిర్ణయించుకోగలదు. మానవునికి ఆ తెలివి ఉంది. పశువు నిర్ణయించుకోలేదు. ఏది చేయాలో ఎన్నుకునే విచక్షణ శక్తి మనకు ఉంది. నేను ఇది చేస్తే నాకు మేలు కలుగుతుంది, నేను అది చేస్తే మేలు కలుగదు - అని ఆలోచించుకోగల శక్తి మానవుడికి ఉంది. కాబట్టి మీరు దానిని సరిగా ఉపయోగించుకోవాలి. మన జీవిత గమ్యం ఏదో ముందుగా తెలుసుకోవాలి, తరువాత దానిని బట్టి నిర్ణయించుకోవాలి. అది మానవ నాగరకత...

**బార్బరా** : మీరెప్పుడైనా కృష్ణుణ్ణి చూశారా?



**శ్రీల ప్రభుపాదులు** : చూశాను.

**బార్బరా** : నిజంగా చూశారా?

**శ్రీల ప్రభుపాదులు** : ప్రతిదినం, ప్రతిక్షణం.

**బార్బరా** : భౌతిక దేహంలో చూడలేదు కదా!

**శ్రీల ప్రభుపాదులు** : కృష్ణుడికి భౌతిక దేహం లేదు.

**బార్బరా** : అయినా ఇక్కడి గుడిలో కృష్ణుని చిత్రా లున్నాయి.

**శ్రీల ప్రభుపాదులు** : అది భౌతిక శరీరం కాదు. మీవి భౌతిక నేత్రాలు కనుక, ఆధ్యాత్మిక రూపాన్ని చూడలేరు కనుక అతడు దయతో భౌతిక శరీరంతో - మీరు చూడ గలిగేందుకే కాబోలు - ఇలా కనిపిస్తున్నాడు. అయినా దయతో మీకు కనబడడానికి యోగ్యమైన ఆకారంలో ఉన్నంత మాత్రాన దాని అర్థం అతనికి భౌతిక దేహం ఉందని కాదు. అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్యక్షుడు దయతలచి మీ ఇంటికి వచ్చా డనుకోండి. దాని అర్థం మీ స్థితీ, అతని స్థితీ ఒకటే అని కాదు. అది కేవలం అతని దయ. ప్రేమ చేత అతడు మీ ఇంటికి రావచ్చును. కాని, అతడు మీతో సమాన హోదాలో ఉన్నట్లు అర్థం కాదు. అదే విధంగా మనం భౌతిక నేత్రాలతో కృష్ణుని చూడలేము గనుక, కృష్ణుడు మనకు ఒక వర్ణ చిత్రంగా గాని, రాతితోనో కొయ్యతోనో చేయబడిన విగ్రహంగా గాని కనబడుతాడు. అయితే ఈ వర్ణ చిత్రాలు, విగ్రహాల కంటె కృష్ణుడు వేరు కాదు. అంతా కృష్ణుడే కదా!

**బార్బరా** : మనం మరణించిన తరువాత మన ఆత్మ ఏమి అవుతుంది?

**శ్రీల ప్రభుపాదులు** : ఆత్మకు మరో దేహం వస్తుంది.

**బార్బరా** : వెంటనే వస్తుందా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. అచ్చంగా మీరు గదిని మార్చినట్లే. మీ కొత్త గదిని మొట్టమొదట నిర్ణయించుకుంటారు. తరువాత దీనిని విడిచి, అక్కడకు వెళుతారు.

**బార్బరా** : అలా అయితే మనకు ఏ విధమైన దేహం వస్తుందో ముందుగానే తెలుస్తుందా?

**శ్రీల ప్రభుపాదులు** : మీకు అర్హత ఉంటే తెలుస్తుంది. లేకపోతే ప్రకృతే దానిని ఏర్పాటు చేస్తుంది. ప్రకృతి (వారి వారి) యోగ్యతలను బట్టి శరీరాలను ఏర్పాటు చేస్తుంది. మీకు దాని అర్థం తెలియక పోతే, మీ జీవితాన్ని సిద్ధం చేసుకుని ఉండలేదన్న మాట! కాబట్టి, ఆకస్మికంగా మరణం సమయంలో మీ మనస్తత్త్వం మరొక దేహాన్ని ఊహిస్తుంది, ప్రకృతి దానినే మీకు నిర్మిస్తుంది.

**బార్బరా** : ఇక సంకీర్తన - సంకీర్తన ఏం చేస్తుంది?

**శ్రీల ప్రభుపాదులు** : అది మీరీ యువకులను [శిష్యులను] అడుగవచ్చు. దానిని గురించి వారు వివరిస్తారు.

**బాబ్** : సర్వాన్నీ శాసించేవాడు కృష్ణుడే అయితే, భక్తుడు కాని వాడిని కృష్ణు డెలా వశం చేసుకుంటాడు?

**శ్రీల ప్రభుపాదులు** : 'మాయ' ద్వారా! ప్రభుత్వం అన్నింటినీ తన వశంలో ఉంచుకున్నట్లే! రాజ్యం రాజు గారి పరిపాలన శాఖలచేత పాలించబడుతుంది.

**బాబ్** : మరి కృష్ణుడు భక్తులను ఎలా అదుపులో ఉంచుకుంటాడు?

**శ్రీల ప్రభుపాదులు** : మీరు మీకు ఇష్టమైన వారిని ఎలా అదుపులో ఉంచుకుంటారో అలాగే. ఉదాహరణకు : మీకు ఇష్టమైన బిడ్డ ఉంటే, వాడి మేలు కోసమే, వాడిని మీరు అదుపులో ఉంచుతారు. వాడు నిప్పు తాకబోతే వెంటనే మీరు వాడితో: "వద్దు. వద్దు నాయనా, దానిని తాకవద్దు" అంటారు, కాబట్టి కృష్ణ చైతన్యం గలవాడు, కృష్ణ భక్తుడు ఎప్పుడూ తప్పుదారి తొక్కడు. ఎందుకంటే, కృష్ణు డెప్పుడూ అతనికి దారి చూపిస్తూనే ఉంటాడు. ఇక కృష్ణ భక్తి లేని వాళ్ళయితే, 'మాయ' అధీనంలో ఉంటారు. జరుగవలసిన దానిని 'మాయ'యే జరిపిస్తుంది.

**బాబ్** : నేనెప్పుడు మరణిస్తానన్నది, ఇతరులు ఎప్పుడు మరణిస్తా రనేది మనం పుట్టక మునుపే నిర్ణయించ బడుతుందా? నేను జన్మించినప్పుడే నా ఆయుః ప్రమాణం ఇంత అని నిర్ణయం అవుతుందా?

**శ్రీల ప్రభుపాదులు** : అవుతుంది.



**ఒక శిష్యుడు** : దానిని మనం మార్చలేమా?

**శ్రీల ప్రభుపాదులు** : మార్చలేము. కాని కృష్ణుడు మార్చగలడు.

**ఒక శిష్యుడు** : ఎవరైనా ఆత్మహత్య చేసుకున్నా రనుకోండి, అది కూడా ముందే నిర్ణయించ బడుతుందా?

**శ్రీల ప్రభుపాదులు** : లేదు. అది ముందే నిర్ణయించ బడదు. మీకు కొంత స్వాతంత్ర్యం ఉంది గనుక ఆ పని మీరు చేయగలరు. ఆత్మహత్య స్వాభావికం కాదు, ప్రకృతి విరుద్ధం. మనం స్వతంత్రులం కాబట్టి ప్రకృతి సిద్ధ ప్రకృతి నుంచి ప్రకృతి విరుద్ధ ప్రకృతికి మారగలం. ఒక ఖైదీ సాధారణంగా ఖైదు నుంచి బయటకు వెళ్ళలేడు. కాని, ఏదో విధంగా గోడ దూకి పారిపోడానికి ఏర్పాటు చేసుకుంటాడు. అప్పుడు అతడు మరి కొన్నాళ్ళు ఖైదులో ఉండవలసిన నేరస్థ డవుతాడు. సహజంగా ఖైదీ తన బంధం నుంచి తప్పించుకో లేడు. ఒకవేళ తప్పించుకోగలిగినా మళ్ళీ పట్టు బడుతాడు. మళ్ళీ దండించ బడుతాడు. వాని కారాగార వాసం పొడిగించ బడుతుంది. లేకపోతే ఇంకా కఠిన దండన విధించ బడుతుంది. అందుచేత మనం సాధారణంగా భవితవ్యాన్ని అతిక్రమించలేము. ఆ పని చేయడానికి ప్రయత్నిస్తే బాధ పడుతాము. అయితే మనం కృష్ణ చైతన్యం గల వాళ్ళమైతే, కృష్ణుడు విధిని మార్చగలడు. మనము మార్చలేము గాని కృష్ణుడు మారుస్తాడు. కృష్ణుడిలా అన్నాడు : "అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" - "నీకు రక్షణ ఇస్తాను." ఆ మార్పు నీ రక్షణ కోసమే జరుగుతుంది.

భక్తుడు కానివాడు,భక్తుడు అయినవాడు అని రెండు దశలు ఉన్నాయి. భక్తి లేని వాడు భౌతిక ప్రకృతి వశంలో ఉంటాడు. భక్తుడు కృష్ణుని ప్రత్యక్ష వశంలో ఉంటాడు. ఒక పెద్ద సంస్థలో కార్య నిర్వాహకుడైన పెద్ద అధికారి కార్యాలయంలో చాలామంది జీతగాళ్ళు ఉంటారు. వారు ఆ యా శాఖా పర్యవేక్షకుల ఆజ్ఞలకు లోబడి ఉంటారు. కాని, అతడు ఇంటి బయట పరోక్షంగానూ, ఇంట్లో ఉన్నప్పుడు

ప్రత్యక్షంగానూ భార్యాబిడ్డల పాలన చూస్తాడు. అతడు ఎప్పుడూ పాలకుడే, అదే విధంగా భగవంతుడు సర్వదా మహా ప్రభువే. భక్తుడైన వాడిని స్వయంగా పరిపాలిస్తాడు. భక్తుడు కాని వానిని తన ప్రతినిధి ద్వారా పరిపాలిస్తాడు. ఆ ప్రతినిధి 'మాయ'. అంటే ప్రతివాడూ ఎవరో ఒకరి వశంలో ఉండవలసిందే. ఉదాహరణకు : అమెరికాలో ప్రతి పౌరుడూ ప్రభుత్వ శాసనానికి బద్ధుడై ఉంటాడు. అతడు తిన్నగా ఉంటే ప్రభుత్వ పౌరశాఖ అతనిని తన వశంలో ఉంచుకుంటుంది. కాకపోతే నేరాల శాఖ వశంలో ఉంచుతుంది. "నేను ఎవరి వశంలోనూ లేను" అని అతడు అనలేడు. అలా జరుగదు. ప్రతివాడూ ఎవరో ఒకరి వశంలోనే ఉంటాడు. ఎవ్వడైనా : "నేను ఎవరి వశంలోనూ లేను" అని అంటే, వాడు వట్టి పిచ్చివాడు, వెర్రివాడు. ప్రతివాడూ అదుపులో ఉండవలసిందే. అందుచేత మిమ్మలను కృష్ణుడే స్వయంగా తన వశంలో ఉంచుకుంటాడు. లేదా అతని ప్రతినిధి అయిన 'మాయ' తన వశంలో ఉంచుకుంటుంది. 'మాయ' వశంలో ఉన్నప్పుడు మీరు మీ జీవితాన్ని పాడు చేసుకుంటారు. మీరు భౌతిక పరిధిలోనే ఉండి జన్మ తరువాత జన్మ ఎత్తుతూ ఉంటారు. అంటే మీరు శరీరాలను మార్చుకుంటూ ఉంటారు. కాని, భగవంతుని రక్షణ కోరితే, ఈ శరీరం త్యజించిన తరువాత మీరు ఇంటికి తిరిగి వెళుతారు, అంటే భగవంతుణ్ణి చేరుతారు. అప్పుడు మీ జీవితం ధన్యమైనట్లు. భగవంతుని రక్షణ లేకపోతే మీరు జీవించలేరు. అది సాధ్యం కాదు. అతని రక్షణ కోరడమే జ్ఞానం. భగవద్గీతలో ఇలా చెప్పబడింది: "బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" - "పెక్కు జనన మరణాలతరువాత జ్ఞాని నన్ను శరణు వేడుతాడు." "వాసుదేవ స్సర్వ మితి" : "కృష్ణా! సర్వమూ నీవే కాబట్టి నేను నీ దరికి చేరాను. నన్ను స్వీకరించు. నేను ఇప్పుడు నన్ను నీకు పూర్తిగా సమర్పించుకుంటున్నాను. నన్ను ఏలుకో. నేను నీ వశంలో ఉన్నాను. ఇంతవరకు నేను ఈ దుర్మార్గుల ఆధీనంలో నా ఇంద్రియాలకు లోబడి ఉన్నాను. ఈ ఇంద్రియాల వశంలో ఉండి నేను



కుటుంబం, సంఘం, దేశం, జాతి అనబడే వాటిని మొదలుకొని కుక్కల వరకు సేవించాను. కాని నాకు ఏదీ తృప్తి కలిగించలేదు. నాకు ఇప్పుడు బుద్ధి వచ్చింది. నేను నీ అధీనంలోనే ఉంటాను. కుక్కల ఏలుబడిలో కంటె భగవంతుని ఏలుబడిలో ఉండడం మంచిది." ఇదీ కృష్ణ చైతన్యం. మనుష్యులు కుక్కల వశంలో ఉండడం మీరు చూడలేదా? వీధిలో ఆగి కుక్క మలమూత్ర విసర్జనం చేస్తుంది. అప్పటి వరకూ దాని యజమాని వేచి ఉంటాడు. అవునా? దాని యజమాని "నేను యజమానిని" అని అనుకుంటాడు. కాబట్టి కృష్ణచైతన్యం లేని వాడికి ఇది అర్థం కాదు. ఆ నీచుడు నిజానికి తన కుక్కకు సేవకు డని మనకు అర్థమవుతుంది. కాని, వాడు తాను యజమానిని అని భావిస్తాడు. మీ అభిప్రాయం ఏమిటి? వాడు కుక్కకు వశుడు కాడా?

**బాబ్** : అవును.

**శ్రీల ప్రభుపాదులు** : కాని, వా డేమనుకుంటున్నాడు? "నేను ఈ కుక్కకు ప్రభువును" అని భావిస్తున్నాడు. కుటుంబ యజమాని తన భార్యకు, బిడ్డలకు, నౌకర్లకు, ప్రతి వారికి సేవకుడు, కాని అతడు : "నేను యజమానిని" అనుకుంటాడు. అధ్యక్షుడైన నిక్సన్ తాను అమెరికాకు యజమానిని అని అనుకొంటాడు. కాని అతడు ఇతరుల వశంలో ఉన్నాడు. ఒక్క క్షణంలో అతని సేవకులు, ప్రజలు అతనిని ఆ పదవి నుంచి తొలగించగలరు. అప్పుడు : "నేను మీకు మంచి సేవ చేస్తాను, నేను మీ ప్రథమ సేవకుడుగా ఉంటాను" అనే స్థితికి వస్తాడు. కాబట్టి ప్రజలు "సరే, నువ్వు మాకు అధ్యక్షుడుగా ఉండు" అని వోటు వేస్తారు. అతడు అధ్యక్షుడై : "నన్ను మళ్ళీ ఎన్నుకోండి. నన్ను మళ్ళీ ఎన్నుకోండి" అని మళ్ళీ అర్థిస్తాడు. అంటే, అతడు సేవకు డన్నమాట. కాని : "నేను యజమానిని" అనుకుంటాడు. అదీ అతని పరిస్థితి. అదే 'మాయ'. 'మాయ' కు వశుడైన వాడు తాను ప్రభువునని భావిస్తాడు. గాని, నిజానికి అతడు సేవకుడు. భక్తుడు ఎప్పుడూ "నేను ప్రభువును" అని భావించడు, "నేను భృత్యుడను" అనే

భావిస్తాడు. అదీ మాయకూ, సత్యానికీ ఉన్న భేదం. అతనికి కనీసం "నేను ఎప్పుడూ ప్రభువును కాను. ఎప్పుడూ సేవకుణ్ణే" అనైనా తెలుసును. సేవకుడు తాను ప్రభువును అనుకోడం భ్రమ. సేవకుడు తాను సేవకుడనని భావించడం భ్రమ కాదు; 'ముక్తి'. అతడు అసత్య భావాలకు లోబడడు. ఆ విషయం గురించి ఆలోచించడానికి ప్రయత్నిస్తాడు. భక్తుడెప్పుడూ అసత్య భావాలకు లోబడడు. అతనికి తన స్థితి తెలుస్తుంది. "స్వరూపేణ వ్యవస్థితిః" - 'ముక్తి' లేక మోక్షం అంటే తన రూపంలో ఉండి పోవడం. నేను సేవకుణ్ణి కాబట్టి నేను సేవకుడను అని నాకు తెలియడమే ముక్తి. నేను ప్రభువును అని భావించడం బంధం. ఇదే బంధ జీవితానికీ, ముక్త జీవితానికీ భేదం.

కాబట్టి, ఈ కృష్ణ చైతన్యోద్యమ భక్తులు తాము కృష్ణ సేవకులమనే ఎప్పుడూ భావిస్తారు. అందుచేత వారంతా ముక్తులు. వారు ముక్తి కోసం ప్రయత్నించరు. వా రిదివరకే ముక్తులై పోయారు. కారణం వారు స్వరూప వ్యవస్థితులై ఉన్నారు. వారు : "నేను ప్రభువును" అని కృత్రిమంగా భావింపరు. ప్రతివాడూ "నేను ప్రభువును" అని భావిస్తున్నాడు. అది భ్రమ, మాయ. మీ జీవితంలో ఏ దశలోనైనా మీరు ప్రభువు కాలేరు. మీరు సేవకులుగా ఉండవలసిందే. అదీ మీ స్థితి. తాను ప్రభువునని కృత్రిమంగా భావించేవాడు బంధంలో జీవిస్తున్నాడు. అలా కాక, స్వయంగా పరమ ప్రభువుకు తనను తానే అర్పించుకోడం 'ముక్తి'. భక్తుడు ప్రత్యేకంగా మోక్షం అనబడే దాని కోసం ప్రయత్నించడు. కృష్ణునికి గాని, కృష్ణుని ప్రతినిధికి గాని తనను తాను అర్పించుకున్న వెంటనే అతడు ముక్తుడు అవుతాడు.

**బాబ్** : ప్రభుపాదుల వారూ! 'జీసస్ ఫ్రీక్స్' (క్రైస్తవ మతమౌఢ్య వాదులు) లాంటి వారూ, ఇతరులూ జీసస్ తమను నడిపిస్తున్నాడని అంటారు. నిజమేనా?

**శ్రీల ప్రభుపాదులు** : అవును. అయితే వారు అతనిని అనుసరించడం లేదు, అచ్చంగా క్రైస్తవులలాగే! "మీరు చంపకూడదు" అని జీసస్ వారికి మార్గం



చూపిస్తూ ఉంటే, వారు చంపుతూనే ఉన్నారు. ఇక జీసస్ మార్గదర్శకత్వం ఎక్కడుంది? "నేను జీసస్ చెప్పినట్లు చేస్తున్నాను" అంటే సరిపోతుందా? "నేను ఆయన చెప్పింది లెక్కచేయను" అనడం ఆయనచేత నడిపించబడడం అవుతుందా? జీసస్ క్రైస్ట్ చెప్పినట్లు ఎవ్వరూ చేయడం లేదు. వారు చెప్పుకుంటున్నది అబద్ధం. జీసస్ చెప్పినట్లు చేసేవారిని కనుక్కోడం చాలా కష్టం. జీసస్ మార్గదర్శిత్వం ఇప్పటికీ ఉంది. కాని ఎవడూ దానిని లెక్కజేయడం లేదు. జీసస్ క్రైస్ట్ అంటే తమ పాపా లన్నిటినీ తొలగించే పనిని గుత్తకు పుచ్చుకున్నాడని భావిస్తున్నారు. అది వారి తత్త్వం. వారు సమస్త పాపాలనూ చేస్తారు. పాపం! జీసస్ క్రైస్ట్ వాటికి బాధ్యుడు. అది వారి మతం. కాబట్టి వారు: "మా మతం చాలా మంచి మతం. మేము చేసే సమస్త పాపాలకూ జీసస్ బలి అవుతాడు" అని అంటారు. మరి అది మంచి మతమా? వారికి జీసస్ క్రైస్ట్ పట్ల సానుభూతి లేదు. "అతడు మన పాపాల కోసం మరణించాడు. మనం ఎందుకు పాపాలు చేయాలి? మన పాపాలకై అటువంటి మహా జీవితం త్యాగం చేయబడింది" అని వారు ఆలోచించరు. "ఆహా! మనం సర్వ పాపాలనూ చేస్తూనే ఉందాము. మన పాపా లన్నీ రద్దు చేసే పనిని జీసస్ గుత్తకు తీసుకున్నాడు. నేను కేవలం ప్రార్థన మందిరానికి (అంటే చర్చికి) పోయి తప్పు ఒప్పుకొని, తిరిగి వచ్చి సమస్త పాపాలనూ చేస్తాను" అనే వారు అనుకుంటున్నారు. అది చాలా తెలివైన పనిలా మీకు అనిపిస్తూందా?

**బాబ్** : లేదు.

**శ్రీల ప్రభుపాదులు** : ఆచరణలో జీసస్ చెప్పినట్లు చేసేవాడు నిజంగా ముక్తుడవుతాడు. కాని, జీసస్ క్రైస్ట్ చెప్పినట్లు చేసే వాడు కనిపించడం చాలా అరుదైన సంగతి.

**బాబ్** : 'జీసస్ ఫ్రీక్స్'ల మాటేమిటి? వారు జీసస్ ఉద్యమంలో చేరిన యువకులు. వారు బైబిలును తరచు చదువుతారు. వారు దానిని అనుసరించడానికి...

**శ్రీల ప్రభుపాదులు** : బైబిలు ఉపదేశాలకు హింస విరుద్ధం. బైబిలు ప్రకారం నడుచుకునే వారు ఎలా వధించగలరు?

**బాబ్** : వారిలో ఒకరిని నేను ఇదే అడిగాను. జీసస్ క్రైస్ట్ మాంసాహారి అన్నట్లు బైబిలులో కూడా ఉందన్నాడు.

**శ్రీల ప్రభుపాదులు** : అది సరే! ఆయన ఏదైనా తినవచ్చును. ఆయన శక్తిమంతుడు. కాని, ఆయన : "నీవు చంపకూడదు. నీవు చంపడం మానాలి" అని ఆజ్ఞాపించాడు. ఆయన ప్రభావవంతుడు. జగత్తును అంతటినీ తినగలడు. కాని, మీరు మిమ్మల్ని జీసస్‌తో పోల్చుకో కూడదు. మీరు జీసస్‌ను అనుకరించలేరు. అతని ఆజ్ఞలకు కట్టుబడి ఉండాలి. అప్పుడు మీకు ఆయన మార్గదర్శి అవుతాడు. అదీ నిజమైన విధేయత అంటే. అది శ్రీమద్భాగవతంలో వివరించబడింది. శక్తిమంతుడైన ఈశ్వరుడు ఏదైనా చేయగలడు. అతనిని మనం అనుకరింపలేము. అతని ఆజ్ఞలకు బద్ధులమై ఉండాలి. జీసస్ క్రైస్ట్ మాంసం తిన్నాడు అంటున్నారు. సరే, ఒప్పుకుందాం. అయితే అతడు ఏ స్థితిలో మాంసం తిన్నాడో మీకు తెలియదు. ఆయన తాను స్వయంగా మాంసం తింటున్నప్పటికీ అది తప్పు అని ఇతరులకు సలహా ఇచ్చాడు. జీసస్ తాను చెప్పినదానికి విరుద్ధంగా చేశా డనుకుంటున్నారా?

**బాబ్** : లేదు.

**శ్రీల ప్రభుపాదులు** : ఆ పని ఆయన చేయలేడు. ఆయన ఆ విధంగా చేయడు - అనేది ఆయన యందు నిజమైన విశ్వాసం. "అలా అయితే ఆయన మాంసం ఎందుకు తిన్నాడు? అది అతనికీ తెలుసును - కాని చంపడం మానుమని నన్ను అడిగాడు. నేను దానిని అనుసరించాలి." అది సరియైన పద్ధతి. మీరు జీసస్ క్రైస్ట్ కారు. ఆయనను అనుకరించలేరు. అతడు భగవంతునికి తన ప్రాణాలను అర్పించాడు. మీరు ఆ పని చేయగలరా? కాబట్టి జీసస్‌ను మీరు ఎందుకు అనుకరిస్తారు? మాంస భక్షణంలో జీసస్‌ను అనుసరిస్తున్నారు. మరి మీరు



భగవంతుని చైతన్యం వ్యాపింప చేయడానికి జీవితాన్ని త్యాగం చేయడంలో జీసస్‌ను ఎందుకు అనుసరించరు? ఏమిటి ఆలోచిస్తున్నారు? వారు ఆలోచించేదే వారు బోధించేటప్పుడు చెబుతారు. కాని, ఆ నామమాత్రపు క్రైస్తవులు భగవంతుని కోసం ఏం చేస్తున్నారు? కొంచెం సేపు సూర్యుణ్ణి గురించి ఆలోచించండి. సూర్యుడు మూత్రాన్ని పీల్చి వేస్తున్నాడు. మీరు మూత్రాన్ని త్రాగ గలరా? మీరు సూర్యుణ్ణి అనుకరింప దలిస్తే - "ఆహా! సూర్యుడు మూత్రాన్ని పీల్చి వేస్తున్నాడు. నేను మూత్రాన్ని తాగుతాను!" అనుకుని ఆ పని చేయగలరా? జీసస్ క్రీస్తు మహాశక్తి సంపన్నుడు. అతడు ఏదైనా చేయగలడు. కాని, అతడు చేసినట్లు మనం చేయలేము. కేవలం అతడు చెప్పినట్లు చేయవలసిందే. అదీ వాస్తవమైన క్రైస్తవ మతం. శక్తిమంతుణ్ణి అనుకరించలేము. అది తప్పు. విష సముద్రం అనేది ఒకటి ఉండే దని మా వేద సాహిత్యంలో ఉంది. దానిని ఏం చేయాలో ప్రజలకు తెలియలేదు. అప్పుడు శివుడు : "నేను దానిని త్రాగేస్తాను" అని ఆ విష సముద్రాన్నంతటినీ త్రాగి కంఠంలో నిలుపుకున్నాడు. మరి మీరు విషం త్రాగగలరా? సముద్రమంత కాదు, కేవలం ఒక గిన్నెడు విషాన్నైనా త్రాగగలరా? మనం శివుణ్ణి అనుకరించగలమా? మనం కూడా విషం త్రాగాలని శివు డెప్పుడూ చెప్పలేదు. కాబట్టి చెప్పినట్లు చేయాలి గాని, చేసినట్లు చేయకూడదు. ఈ ఎల్.ఎస్.డి. జనం, మార్జువానా జనం శివుడు గంజాయి పొగ త్రాగాడని చెబుతారు. కాని, శివుడు విష సముద్రం మొత్తం త్రాగాడు. మీ రాపని చేయగలరా? శివుని ఆజ్ఞలను గ్రహించాలి. పూజలన్నిటిలోకీ విష్ణు పూజ శ్రేష్ఠమైనదని అతడు అన్నాడు: "విష్ణోరా రాధనం పరమ్." ఏ పూజ శ్రేష్ఠమని పార్వతి అడిగినప్పుడు: "పూజలలో కెల్ల విష్ణుదేవుని (కృష్ణుని) పూజ శ్రేష్ఠం" అని చెప్పాడు. చిల్లర దేవుళ్ళు చాలా మంది ఉన్నారు. కాని విష్ణు దేవుని పూజ ఉత్తమమని చెప్పాడు. విష్ణు పూజ కంటె గొప్పది వైష్ణవుని పూజించడం - 'తదీయానామ్' - విష్ణుసేవకులను పూజించడం గాని, విష్ణువుతో సంబంధం

కలవారిని పూజించడం గాని - అంటే మనం ఈ తులసి మొక్కను పూజిస్తున్నాము. మనం అన్ని మొక్కలనూ పూజించము. కాని ఈ తులసికి కృష్ణునితో - విష్ణు దేవునితో - దగ్గర సంబంధం ఉంది కాబట్టి దీనిని పూజిస్తాము. అదే విధంగా ఏదైనా కృష్ణునితో దగ్గర సంబంధం ఉన్నదైతే దానిని పూజించడం విష్ణు పూజ కంటె గొప్పది.

**బాబ్** : ఎందుచేత?

**శ్రీల ప్రభుపాదులు** : ఎందుచేతనంటే దాని వలన కృష్ణుడు ప్రీతుడు అవుతాడు. మీకు ఒక పెంపుడు కుక్క ఉందనుకోండి. కొంత మంది స్నేహితులు వచ్చి ఆ కుక్కను వీపు మీద చేతితో తట్టి బుజ్జగిస్తారు. [శ్రీల ప్రభుపాదులు పెద్దగా చేత్తో తట్టుతున్నట్లు అభినయించారు.] అప్పుడు మీరు ప్రీతులవుతారు: "ఓహో! ఇతడు మంచి మిత్రుడు" అని మీరు ప్రసన్నులవుతారు. మిత్రుడు వచ్చి : "మిత్రుడా, నీకు ఎంత మంచి కుక్క ఉందోయ్!" అని అంటాడు. [నవ్వు.] [కొందరు భారతీయ అతిథులు గదిలో ప్రవేశిస్తారు.]

**శ్రీల ప్రభుపాదులు** : దయ చేసి కొంచెం ప్రసాదం స్వీకరించండి.

[శ్రీల ప్రభుపాదులు అతిథులతో కొంతసేపు ఇంగ్లీషులోనూ, కొంత సేపు హిందీలోనూ సంభాషించారు. న్యూయార్క్ నుంచి ఆయన ఆవాళే వెళ్ళిపోతున్నారు. ఆయన లండనుకు వెళ్ళబోయే విమానం కొన్ని గంటలలోనే బయలు దేరుతుంది. శ్రీల ప్రభుపాదుల వారిని కెన్నెడీ విమానాశ్రయానికి తీసుకువెళ్ళడానికి బాబ్ ఒక కారు తెచ్చాడు. భక్తులు ఆయన సామానులు కారులో పెడుతూ, శ్రీల ప్రభుపాదుల వారి అనువాద గ్రంథాల వ్రాతప్రతులను వరుసగా పెడుతూ ఇంకా మిగిలి ఉన్న ఏర్పాట్లు గురించి హడావిడి పడుతున్నారు.]

**శ్యామసుందర దాస్** : ప్రభుపాదుల వారూ! అన్నీ సిద్ధంగా ఉన్నాయి. మన కోసం కారు కూడా వచ్చింది.

**శ్రీల ప్రభుపాదులు** : అయితే మనం ఇంక బయలుదేరుదామా? హరేకృష్ణ!

# ముగింపు మాటలు

1976 జూలై 19వ తేదీన పూజ్యశ్రీ ఏ.సి.భక్తివేదాంత స్వామి ప్రభుపాదులు నన్నూ, నా భార్యనూ తమ శిష్యులుగా స్వీకరించి, నాకు బ్రహ్మతీర్థ దాస అనీ, నా భార్యకు భక్తదేవీ దాసి అనీ పేరు పెట్టారు. ఆ పుణ్య దినాన్ని నేను గుర్తుకు తెచ్చుకున్నప్పుడల్లా పూజ్యశ్రీ ప్రభుపాదుల వారినీ, హరేకృష్ణ ఉద్యమం లోని వారి శిష్యులనూ కలసికోడం వలన నేనెంత అదృష్టవంతుణ్నో తెలుసుకుని ఆనందిస్తున్నాను.

ఆ దీక్షా సందర్భంలో వారు నాకు జపమాలను ప్రసాదించినప్పుడు విధాయక సూత్రాలను అనుసరిస్తూ, భగవంతుని నామాలను ప్రతిదినం సంకీర్తన చేస్తానని ప్రతిజ్ఞ చేశాను. అంతకు ముందు నాలుగేళ్ళకు పూర్వమే శ్రీల ప్రభుపాదులు ఈ నియమాలను పాటించాలనీ, ఆరు నెలల్లోనే నేను ఇతర శిష్యులతో సమానంగా పురోగమించగలననీ, చలన చిత్రాలూ, ఆహార శాలలూ మొదలైన అనవసర విషయాలూ, అనర్థాలూ ఇక నన్ను ఆకర్షించవనీ చెప్పారు. "మానవ జీవితం అంతా పవిత్రతకే ఉద్దేశించబడింది" అని ఆయన అన్నారు. పవిత్రత అంటే ఏమిటో నాకు నిజంగా తెలియకపోయినా, పరిశుద్ధుడను కావాలనే ఆసక్తి నాకు కలిగింది. చైతన్యంలో పైస్థాయి అందుకుందా మన్న ఉద్దేశంతో నేను శాంతి సైన్యంతో (అమెరికన్ పీస్ కోర్) భారతదేశానికి వెళ్ళాను. కేవలం ఇంద్రియ సంతృప్తి పరమ పురుషార్థ మని నేను నమ్మక పోయినా నేను స్వయంగా ఇంద్రియాల వశంలోనే ఉండేవాణ్ణి. తరువాత కొంత కాలానికి ఇంద్రియాల వశం నుంచితప్పించుకో గలగడమే యోగం అని తెలిసికో గలిగాను.

అమెరికాకు తిరిగి వచ్చిన తరువాత ఒక భూగర్భ శాస్త్ర కళాశాలను ప్రారంభించాను. పెళ్ళి చేసుకున్నాను. సంసార బాధ్యతలలో చిక్కుకున్నాను.

కాని, తరచు శ్రీల ప్రభుపాదుల వారితో జరిగిన సంభాషణల గురించీ, వారు ఇచ్చిన ఉపదేశాల గురించీ ఆలోచిస్తూ ఉండేవాణ్ణి. వారు నాకు చేసిన మొదటి ఉపదేశాలలో ఒకటి వారి శిష్యుల సాంగత్యం. అది నేను సంతోష పూర్వకంగా చేశాను. భక్తుల సంగతే వేరు. భగవంతునికి భక్తియుత సేవ చేయడమే జీవిత లక్ష్యమని గ్రహించిన వారు కాబట్టి, ఇంద్రియ సుఖాలనే అల్ప వ్యవహారాలలో చిక్కుకోకుండా దురహంకారానికి దూరంగా ఉంటారు. హరేకృష్ణ దేవాలయానికి వెళ్ళడం చాలా ఉల్లాసకరంగా ఉండేది. క్రమంగా నేనూ, నా భార్యా కూడా చాలామంది శిష్యులకు మిత్రుల మయ్యాము. ఆ ఉద్యమానికి ఏదైనా సేవ చేయాలని కుతూహలపడ్డాము. నేను విశ్వ విద్యాలయంలో భక్తియోగ సంఘాన్ని ప్రారంభించాను. ఇక మా ఇల్లు యాత్రలు చేసే శిష్య బృందాలకు మార్గ మధ్యంలోని ఒక మజిలీగా ఉండేది.

మేము శ్రీల ప్రభుపాదుల వారి ఉపదేశాలను అనుసరించిన కొలదీ మా భోజనం కూడా పవిత్ర మయింది. నేను భారతదేశంలో ఉన్నంతవరకు కృష్ణుడు భగవంతు డను విషయం గ్రహించక పోవడం వలన, భక్తులలాగ నా ఆహారాన్ని కృష్ణునికి సమర్పించ లేకపోయానని శ్రీల ప్రభుపాదులకు తెలిపాను. ఆయన : "నీవు భోజనం చేసే ముందు ఆ ఆహారాన్ని ప్రసాదించినందుకు ఊరకే భగవంతునికి కృతజ్ఞత తెలుపుకో!" అన్నారు. మేము అలాగే చేశాము. చివరకు మా భక్తి పరిపక్వమైంది. మా ఆహారాన్ని భగవంతునికి నివేదించడం ప్రారంభించాము. భగవంతుని కోసం వండడం ఎంత అద్భుతమైన అనుభవం! అది నిజంగా మమ్ములను జిహ్వా చాపల్యం నుంచి విముక్తులను చేసింది.

చివరికి హరేకృష్ణ దేవాలయ జీవితంలోనే పూర్తిగా నిమగ్నులం కావడానికి మేము సిద్ధపడ్డాము. కృష్ణుని అనుగ్రహం వలన టెక్సాసులో హరేకృష్ణ దేవ మందిరం దగ్గరే నాకు ఉద్యోగం దొరికింది. కాబట్టి మందిర కార్యకలాపా లన్నిటిలోను పాల్గొనడం ప్రారంభించాను. ఈ విధంగా శ్రీల ప్రభుపాదులు



ఇదివరకే చెప్పినట్లు సమస్త అనర్థాలూ మాయ మయ్యాయి. మా భుజాల మీద నుంచి పెద్ద బరువు దించినట్లయింది. మేము ఇక మా ఇంద్రియాలకు బానిసలం కాము. భగవంతునికీ, భాగవతులకూ మాత్రమే సేవకులము. శ్రీల ప్రభుపాదుల ఉపదేశాల విలువ ఇప్పుడు స్పష్టంగా తెలుస్తోంది. మానవ జన్మ గాడిదలాగ కష్ట పడడానికీ, కుక్కలాగ అనుభవించడానికీ ఉద్దేశించింది కాదు. శుద్ధి పొందడం అంటే చైతన్యంలో పైస్థాయికి చేరడం.

నేను కూడా దీక్ష పొందినప్పటికీ, భగవద్భక్తులైన నా సోదరుల ఆధ్యాత్మిక చైతన్యాన్ని ఇంకా మెచ్చుకుంటూనే ఉన్నాను. ఇంకా పురోగమించాలని కోరుకుంటున్నాను. నిజానికి దీక్షా స్వీకారం అంటే ప్రారంభం అనే అర్థం.

**బ్రహ్మతీర్థ దాస అధికారి**
**(బాబ్ కోహెన్)**
హౌస్టన్, టెక్సాస్
అక్టోబర్ 16, 1976



# పూజ్యశ్రీ ఏ.సి.భక్తివేదాంతస్వామి ప్రభుపాదుల వారి పరిచయం

పూజ్యశ్రీ ఏ.సి.భక్తివేదాంతస్వామి ప్రభుపాదులు భారతదేశంలోని కలకత్తానగరంలో 1896వ సంవత్సరంలో జన్మించారు. వారు తమ ఆధ్యాత్మికాచార్యులైన శ్రీల భక్తిసిద్ధాంత సరస్వతీ గోస్వామి వారిని కలకత్తాలో 1922వ సంవత్సరంలో మొదటిసారి కలుసుకున్నారు. శ్రీల భక్తిసిద్ధాంత సరస్వతుల వారు ప్రముఖ మత విద్వాంసులు, 64 గౌడీయ మఠాలను (వైదిక సంస్థలను) స్థాపించారు. వారు విద్యాసంపన్నులూ, యువకులూ అయిన ప్రభుపాదుల వారిని చూచి ఎంతో సంతోషించి, వైదిక జ్ఞానాన్ని బోధించడానికి తమ జీవితాన్ని అంకితం చేయుమని ఉపదేశించారు. ఆనాటి నుంచీ శ్రీల ప్రభుపాదులు వారికి శిష్యులై పదకొండు సంవత్సరాల తరువాత యథావిధిగా దీక్ష తీసుకున్నారు.

మొదటి సమావేశంలోనే శ్రీల భక్తిసిద్ధాంత సరస్వతీ ఠాకూరగారు ఆంగ్ల భాష ద్వారా వైదిక జ్ఞానాన్ని ప్రచారం చేయుమని శ్రీ ప్రభుపాదులవారిని కోరారు. తరువాతి సంవత్సరాలలో శ్రీల ప్రభుపాదులు భగవద్గీతకు భాష్యం వ్రాసి, గౌడీయ మఠ కార్యక్రమాలకు తోడ్పడ్డారు. 1944లో 'బ్యాక్ టు గాడ్‌హెడ్' (భగవద్దర్శనము) అనే ఆంగ్ల పక్ష పత్రికను స్థాపించారు. అది ఇప్పుడు పాశ్చాత్యదేశాలలో వారి శిష్యుల చేత ముప్పయి కంటె ఎక్కువ భాషలలో కొనసాగించబడుతూంది.

శ్రీల ప్రభుపాదుల భక్తి విజ్ఞానాలను గుర్తించి 1947లో గౌడీయ వైష్ణవ సంఘం వారికి భక్తివేదాంత బిరుదు యిచ్చి గౌరవించింది. 1950లో 54 సంవత్సరాల ప్రాయంలో ప్రభుపాదుల వారు వైవాహిక జీవితాన్ని విడిచిపెట్టారు. ఎక్కువకాలం గ్రంథాలను చదవడానికీ, వ్రాయడానికీ వినియోగించసాగారు. తరువాత వారు బృందావనానికి వెళ్ళి అక్కడ మధ్యయుగంలో చరిత్రప్రసిద్ధి కెక్కిన రాధా దామోదర దేవాలయంలో అతి నిరాడంబర జీవితం గడిపారు. అక్కడే వారు చాలా సంవత్సరాల పాటు ఉండి ఎంతో విద్యా వ్యాసంగం చేసి అనేక గ్రంథాలు వ్రాశారు. 1959లో సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించారు. తమ జీవిత ముఖ్య రచన అయిన శ్రీమద్భాగవతంలోని 18,000 శ్లోకాలకు అనువాదం, వ్యాఖ్యానం అనేక సంపుటాలుగా వ్రాయడం ప్రారంభించారు. గ్రహాంతర సులభయానం అనే మరో గ్రంథాన్ని కూడా వ్రాశారు.

శ్రీమద్భాగవతం మూడు సంపుటాలు ప్రచురించాక ప్రభుపాదుల వారు తమ ఆధ్యాత్మికాచార్యుల కోరికను నెరవేర్చడానికి 1965లో అమెరికా సంయుక్త రాష్ట్రాలకు వెళ్ళారు. అప్పటి నుంచీ వారు భారతీయ వేదాంత గ్రంథాలపై ప్రామాణికాలైన వ్యాఖ్యానాలూ, భాషాంతరీకరణాలూ, సంగ్రహ వ్యాఖ్యలూ 70 సంపుటాలకు పైగా వ్రాశారు.

1965లో మొట్టమొదటిసారిగా ఒక వాణిజ్యనౌకలో న్యూయార్కు నగరానికి వెళ్ళినప్పుడు వారిదగ్గర ఒక్కపైస కూడా లేదు. తరువాత ఒక సంవత్సరానికి అంటే 1966 జూలైలో వారు అతికష్టం మీద అంతర్జాతీయ కృష్ణ చైతన్య సంఘాన్ని (ISKCON) స్థాపించగలిగారు. పది సంవత్సరాల లోపలే ఆ సమాజం బాగా అభివృద్ధి చెంది ప్రపంచమంతటా వ్యాపించసాగింది, పాఠశాలలు, దేవాలయాలు, ఆశ్రమాలు మొదలైన వాటిని నెలకొల్పసాగింది.

1968 లో శ్రీల ప్రభుపాదుల వారు న్యూవర్జీనియాలోని కొండల మీద ఆధ్యాత్మిక సమాజాన్ని స్థాపించి దానికి నూతన బృందావనం అని పేరు పెట్టారు. అక్కడే ఒక వైదిక పాఠశాలను నెలకొల్పి పాశ్చాత్యదేశాలకు సైతం వైదిక గురుకుల విద్యావిధానాన్ని అందుబాటులోకి తెచ్చారు. ఆ నూతన బృందావనం ఇప్పుడు వేయి ఎకరాలకు పైగా వైశాల్యం గల ప్రదేశంలో విరాజిల్లుతూంది. అమెరికాలోని వారి శిష్యులు అలాంటి సంఘాలను చాలా వాటిని స్థాపించారు.

1972 లో పూజ్యశ్రీ ప్రభుపాదులవారు పాశ్చాత్య దేశాలలోని డెల్లాస్, టెక్సాస్‌లలో వైదిక పద్ధతిలో గురుకులాలను ఏర్పాటుచేశారు. 1972లో ముగ్గురు విద్యార్థులతో ప్రారంభమైన గురుకులం 1975 నాటికి 150 మంది విద్యార్థులతో విరాజిల్లింది.

శ్రీల ప్రభుపాదులు భారతదేశంలో చాలా అంతర్జాతీయ కేంద్రాలను నిర్మింపచేయడానికి ప్రోత్సహించారు. పశ్చిమ బెంగాలులోని మాయాపూర్‌లో

శ్రీ ధామమనే అంతర్జాతీయ ఆధ్యాత్మిక కేంద్రాన్ని నిర్మించ తలపెట్టారు. అతి విస్తృతమైన ఆ పథక నిర్మాణానికి చాలా కాలం పట్ట వచ్చును. అది వైదిక శాస్త్ర పఠనానికి కూడ అనుకూలంగా నిర్మించబడింది. భారతదేశంలోని బృందావనంలో మహోన్నతమైన కృష్ణబలరామ దేవాలయం ఆ పద్ధతుల ప్రకారమే నిర్మించబడింది. అక్కడ ఒక అంతర్జాతీయ అతిథిగృహం కూడ నిర్మించబడింది. పాశ్చాత్యులక్కడ నుంచి వైదిక సంస్కృతిని స్వయంగా నేర్చుకునే అవకాశం ఉంది. బొంబాయిలో ప్రధాన సాంస్కృతిక విద్యాకేంద్రం కూడ ఉంది. భారతదేశంలో సుమారు పద్దెనిమిది ముఖ్యస్థానాలలో ఇతర కేంద్రాల నిర్మాణం కొనసాగుతూంది.

శ్రీల ప్రభుపాదుల వారి ముఖ్యాతిముఖ్యమైన సేవ గ్రంథరచన. దాని ద్వారా వారు ఎంతో ప్రసిద్ధి పొందారు. వారి గ్రంథాలు ప్రామాణికత్వానికీ, జ్ఞాన గాంభీర్యానికీ, వైశద్యానికీ పెట్టింది పేరు. అవి విద్వాంసుల చేత ఎంతగానో గౌరవించబడ్డాయి. అనేక కళాశాలల్లో పాఠశాలల్లో ప్రామాణిక పాఠ్యగ్రంథాలుగా నిర్ణయించబడ్డాయి. వారి రచనలు నలభైకి పైగా భాషలలోకి అనువదించబడ్డాయి. ప్రభుపాదుల వారి గ్రంథాలను ముద్రించి, ప్రకటించడం కోసమే 1972లో భక్తివేదాంత బుక్ ట్రస్ట్ అనే సంస్థను స్థాపించారు. అది ఇప్పుడు భారతీయ మతతత్త్వ విషయాలపై గ్రంథాలను ప్రచురించే ప్రపంచ ప్రముఖ ప్రచురణ సంస్థగా రూపొందింది.

వార్థక్యం సమీపించినా సుమారు పన్నెండు సంవత్సరాలలో శ్రీల ప్రభుపాదులు ప్రపంచమంతటా పధ్నాలుగుసార్లు ఉపన్యాసయాత్ర సాగిస్తూ ఆరు ఖండాలలో పర్యటించారు. అంతటి నిర్విరామ కార్యక్రమాలలో నిమగ్నులై ఉన్నప్పటికీ వారు తమ గ్రంథ రచనను కొనసాగిస్తూనే ఉండే వారు. వారి గ్రంథాలన్నిటినీ కలిపితే ఒక ప్రఖ్యాత వైదిక వేదాంత మత సాహిత్య సంస్కృతీ గ్రంథాలయం అవుతుంది.

1977 నవంబరు 14వ తేదీన వారు ఉత్తరప్రదేశ్‌లోని బృందావనంలో దివంగతులయ్యే వరకూ నిర్విరామంగా శ్రమించారు, ప్రపంచమంతటా వందకు పైగా ఆశ్రమాలనూ, దేవాలయాలనూ సంస్థలనూ స్థాపించి కృష్ణచైతన్య సంఘాన్ని అంతర్జాతీయ సంస్థగా (ISKCON) తీర్చిదిద్దారు.




# అంతర్జాతీయ శ్రీకృష్ణ చైతన్య సంఘం (ఇస్కాన్)

(సంస్థాపక ఆచార్యులు : పూజ్యశ్రీ ఏ.సి. భక్తివేదాంత స్వామి ప్రభుపాదులు)

## అందరినీ ఆహ్వానిస్తూంది!

కృష్ణచైతన్య సాధన ద్వారా శ్రీకృష్ణ భగవానుని భక్తుడు కావడమే మానవ జన్మ లక్ష్యం. ఈ లక్ష్యసాధనకై ఈ క్రింది విధులూ, నిషేధాలూ తోడ్పడుతాయి. వీటిని ఈ సంఘంలో చేరి కాని, ఇంటివద్ద కాని పాటించవచ్చు.

విధులు :

1. శ్రీచైతన్య మహాప్రభువు ప్రసాదించిన :

   "హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే
   హరే రామ హరే రామ రామ రామ హరే హరే"

   అనే మంత్రాన్ని 108 పూసలున్న తులసిమాలతో నిత్యం 16 సార్లు జపించాలి.

2. శ్రీ భగవద్గీత, శ్రీమద్భాగవతం బోధించిన ఉపదేశాలను అనుసరించి పూజ్యశ్రీ ఏ.సి. భక్తి వేదాంత స్వామి ప్రభుపాదుల వారు రచించిన గ్రంథాలను అధ్యయనం చేసి, వాటి ప్రకారం భగవత్ కైంకర్యం చేయాలి.

నిషేధాలు :

1. మాదక ద్రవ్యాలు సేవించరాదు (టీ, కాఫీ, పొగాకు, గంజాయి, భంగు, మద్యం, మొ॥ మాదక పదార్థాలను పూర్తిగా వర్జించాలి).
2. అభక్ష్య భక్షణం చేయరాదు (మాంసం, చేపలు, గ్రుడ్లు, నీరుల్లి, వెల్లుల్లి వంటి తామసిక ఆహార పదార్థాలను వర్జించాలి).
3. నిషిద్ధమైన లైంగిక సంపర్కం పనికిరాదు.
4. ఏ విధమైన జూదం ఆడరాదు.

సర్వస్వం త్యజించి ఇస్కాన్‌లో చేరిన వారికి ఇక్కడి పవిత్ర వాతావరణంలో శిక్షణ ఇవ్వబడుతుంది.

వివరాలకు :

మీ దగ్గరలోని 'ఇస్కాన్' కేంద్రాన్ని సంప్రదించండి; లేదా 'కార్యదర్శి, ఇస్కాన్ (ISKCON), హరేకృష్ణ ల్యాండ్, నాంపల్లి స్టేషన్ రోడ్, హైదరాబాద్ - 500 001' అనే చిరునామాకు వ్రాయండి.



# భక్తివేదాంత బుక్ ట్రస్ట్



## ఇది వాస్తవంగా జరిగింది

జీవిత పరమార్థాన్ని గూర్చిన అన్వేషణలో ఒక యువ అమెరికా శాంతి సైన్య కార్యకర్త పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలోని ఒక ప్రాచీనమైన కుగ్రామం చేరుకున్నాడు. మాయాపూర్ అనే ఆ పుణ్యస్థలంలో ఒక వెదురు తడికెల కుటీరంలో భారతదేశంలోని అత్యంత మహనీయులైన ఆచార్యులలో ఒకరైన పూజ్యశ్రీ ఏ.సి. భక్తివేదాంత స్వామి వారిచరణ సన్నిధిని చేరుకున్నాడు. అతనిని వేధిస్తున్న సర్వ ప్రశ్నలకూ ఆ ఆచార్యుని వద్ద సమాధానాలు లభించాయి. ఆ ఇరువురి సంభాషణే ఈ

**'ఉత్తమ ప్రశ్నలు - ఉత్తమ సమాధానాలు'**